జయ జయ శ్రీ నరసింహా.

# ద్వారక

మానవులలోని మాధవత్వమును ప్రకటనం చేయ డానికై మహాత్ములు మానమధ్య ఉదయిస్తుంటారు. వారి ఆదర్శజీవిత ప్రబోధములద్వారా అజ్ఞానతమః ప్రపంచమునకు పరమాత్మ వెలుగును చూపుతుంటారు. సంతాపనిలయమైన జీవితపుఎడారిలో మహాత్ములు సరోవరాల వంటివాండ్లు. మహాత్ముల ఉదయంచేతనే మానవులలోని దివ్యత్వం ఋజు వవుతుంటుంది. మహాగమ్యమైన శాంతిలభిస్తున్నది. సర్వవిధ ముల మహాత్ములసాంగత్యం జనులను మహాత్ములనుగా మారు స్తుంది; అహంకార పంజరమునుండి విముక్తికల్గించి సర్వ విశ్వాత్మకానందమును కలిగినవారిగా జేస్తుంది.

శ్రీ నరసింహామెహతా పరమ భాగవతోత్తముడు. ఆయన జీవితాచరణమంతా భగవద్గీతలోని భక్తియోగము యొక్క వ్యాఖ్యానమే; జ్ఞానయోగము యొక్క వివరణమే; కర్మయోగము యొక్క తాత్పర్యమే. పురాతన భక్తశిఖా మణియైన కుచేలుడు, అధునాతనమహాపురుషుడైన గాంధిజీ అవతరించిన పునీత గుజరాతు దేశమునందే భక్త నరసింహా మెహతా అవతరించాడు. ఆయన హృదయమహతిపై నిన దించిన గీతాలలో నేటికీ ఆభక్తశిఖామణియొక్క అమర స్వరూపమును సందర్శించి మనం ధన్యులం కాగలం. ఆయన జీవితకథ సాంతమూ కృష్ణవిహారమైన ఒక మహాబృందావనం. కృష్ణుడున్నచోట కపటమనే పూతన నిలువదు. వాంఛా కాళీయుడు ఆడడు; అజ్ఞానప్రవృత్తులనే కంస శిశుపాల జరా సంధాదులు బ్రదుకరు. శ్రీ నరసింహామెహతా జీవితం అట్టి

బృందావనం. ఆమహాత్ముని జీవితాధ్యయనంచేత, సర్వమానవ హృదయాలు బ్రహ్మజ్ఞాన బృందావనంగా ప్రకాశిస్తాయి.

గోరఖ్‌పూర్ 'గీతాప్రెస్సు' వారు, హిందీలో ఈ జీవితకథను ప్రకటించారు. దానికిది రమ్యమైన యథాతథానువాదం. శ్రీరామతీర్థ సేవాశ్రమవేదికపైన సాగుతున్న జ్ఞాన యజ్ఞంలో ఈ పావన గ్రంథమును ఆంధ్రమునందు మధుర మంజులంగా అనువదించి ఒక దివ్యాహుతిగా సమర్పించి, జనతాజనార్దనప్రీతి గూర్చిన శ్రీ రావర్ల జనార్దనరావుగారి సతీమణి శ్రీమతి సురేఖాదేవిగారికి మేము కృతజ్ఞులం. ఈ విదుషీ మణి యొక్క నిస్స్వార్థసేవకు భగవానుడు సుప్రసన్నుడై సర్వశుభముల ప్రసాదించుగాక! ఈ గ్రంథముద్రణలో అవిస్మరణీయ సహాయంచేసిన సాధన గ్రంథ మండలి సంపాదకులు విద్వాన్ శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారికి, పరమోదార శీలురు, స్వాదుహృదయులైన జానకిరాం ప్రెస్ మేనేజరు శ్రీ పోచిరాజు పుండరీకాక్షుడుగారికి సర్వదా కృతజ్ఞులం. వీరికి పరమేశ్వరుడు సర్వశ్రేయములను ప్రసాదిస్తాడుగాక. ఇంకా అజ్ఞాతంగా ఈ మహాప్రచురణకు తోడ్పడిన పుణ్యవ్యక్తులను లోలోన మేము సంస్మరించుకొంటున్నాము. పరమాత్మకృప ఏయేసజ్జనులచేత ఈ జ్ఞానయజ్ఞనిర్వహణమును విజయవంతం చేయించిందో ఆ అందరిలోని త్యాగతేజమునకు ఇదే మా జోహారు! సర్వం శ్రీమన్నారాయణార్పణమస్తు! ఓం తత్సత్.

శ్రీరామతీర్థ సేవాశ్రమం,
పిడుగురాల.
20-11-1957

శ్రీ కేశవతీర్థస్వామి,
శ్రీరామతీర్థ సేవాశ్రమాధ్యక్షుడు,
రామదర్శన పత్రికా సంపాదకుడు.

ఓం

శ్రీహరిః

# మూలపీఠిక

త్వరిత నిహత కంసం యోగిహృద్వ్యాబ్జ హంసం
యదుకుముద సుచంద్రం రక్షణే త్యక్త తంద్రమ్
శ్రుతి జలనిధిసారం నిర్గుణం నిర్వికారం
హృదయ భజముకుందం నిత్యమానంద కందమ్.

భక్తరాజగు నరసింహరాం తన భజనలో "భ్రష్టమై ఇటునటు పర్వులిడు మనసును నిగ్రహించుటకు సత్సాంగత్యమొక గొప్పసాధనము"ని పల్కియున్నారు. కాని ప్రస్తుత కాలమున అట్టి సత్సాంగత్యము లభించుట దుర్లభమగుచున్నది. కాన ప్రాచీనమహాపురుషుల పవిత్ర జీవిత చరితల పఠించి అద్దానిని పొందవలయును. ఈ విషయమునే మనమునందుంచుకొని మేము గుజరాతునందలి భక్తశిరోమణియగు నరసింహమెహతా భక్తచరిత్రను వ్రాయుకృషి సల్పితిమి.

కాని నేటి ఇరువదవ శతాబ్దమున విధినిషేధబంధముల త్యజించి, వ్యక్తిస్వాతంత్ర్యమే పరమపురుషార్థమని తలంచుచు మూర్ఖులకే ఈ బంధనములు కల్పింపబడినవనియూ, వీనిని ప్రపంచమునుండి నిర్మూలించవలెనని భావించెడి సభ్యసమాజమునకు, నాలుగువందల సంవత్సరముల క్రితము జరిగిన ఒక భక్తుని జీవిత చరిత్ర అప్రాసంగికమని తలుతురని మాకు భయమొదవినది. వారి దృష్టిలో ఈ చరిత్రయందలి సమస్త ఘటనలు నిరర్థకములుగను, అవిశ్వసనీయములుగను, కపోల కల్పితములుగను కన్పట్టగలవు. ఈచరిత్ర సమాజమునకత్యంత

అనిష్టదాయకమని తలంతురు. కాని ఏ స్వాతంత్ర్యమును వారు మిన్నగ తలంచుచున్నారో ఏ బుద్ధిబలముపై వారు ఈశ్వరునికి ధర్మమునకు తిలాంజలు లీయదలచిరో, ఆ స్వాతంత్ర్యము, బుద్ధి రెండును వారిని మోసపుచ్చుచున్నవని మేము సవినయముగ సమాజమునకు నివేదించుచున్నాము, వారు దలచు స్వాతంత్ర్యము స్వాతంత్ర్యముకాదు. అట్టి విశృంఖల స్వేచ్ఛాజీవనము పతనమునకు త్రోవదీయును. పరాధీనతలో బడును. భౌతికబుద్ధి దానికి సహచారిణియై మోహ మావరించుటచే పతనకారణ మగుచున్నది. నిజస్వాతంత్ర్య మనునది కల్యాణభావములు, ధర్మజీవనము భగవత్కృపలచేతను మనుజునకు లభించుచున్నవి. నిజముగ మనదౌర్భాగ్యము చేతనే ధర్మానురాగముగల ప్రజలయందుకూడ మిథ్యాచారము జొచ్చి అవిశ్వాసమునకు ప్రబలకారణ మగుచున్నది. దీనికై ఒకరిని నిందింప నగత్యము లేదు. పతనావస్థ సమీపించు ప్రతి దేశ, కాల, సమాజములందు ఇట్టి మిథ్యాచారము వ్యాప్తియగుచుండును. ఇట్టి పరిస్థితుల తొలగించి ప్రపంచమునకు నిజమగు కల్యాణమార్గము చూపుటకై ప్రతిసమాజమునందు ఆయాసమయములందు ప్రతిభాశీలురగు సత్పురుషు లవతరింతురు. ఆమహాపురుషులు మనమధ్యనే వసించి తమ ఆదర్శజీవితములు స్వానుభవములగు అమూల్యోపదేశములచే సామాన్యప్రజలకు ఉన్నతమార్గము జూపింతురు. వారి జీవితముల మన స్థూలబుద్ధులచే గణుతింపలేము. వారి పవిత్ర జీవితములను యథాశక్త్యానుసారము అనుసరించుటయే మనకు సౌభాగ్య విషయము. భక్తరాజగు నరసింహారాముని జీవితము

అలౌకిక విషయవాక్కులచే నిండియున్నది. మన బుద్ధులకు ఆమాటల రహస్యము తెలియుట, విశ్వసించుట కష్టము. అయినను ఆ మాటలు మనలో ఒక విచిత్రమగు ఆశను సంచరింప జేయును. ఆ వాక్కుల వెల్గు మనకు కల్యాణ మార్గము జూపించును.

భక్తరాజుని జీవితచరిత్ర లనేకములు ఆతని మాతృ భాషయగు గుజరాతులో ప్రకటితము లైనవి. కాని యింత వరకు వానిలో ఒకటియైనను భాష, సాహిత్య, చారిత్రక దృష్ట్యా సర్వమాన్యములు కాలేకపోయినవి. జన్మ సంవత్స రముకూడ నేటివరకు వివాదగ్రస్తమైనది. అట్టి స్థితియందు ఈ చరిత్ర సర్వమాన్యము, ప్రమాణమని తెల్పుట కష్టము. వీలైనంత వరకు ఈ చరితను వ్రాయుటయందు భక్తరాజుని పదములే అధికముగ సహాయము తీసికొంటిమి. నిజమగు విస్తృతచరిత్ర లభింపనేరమి ఘటనలనన్నిటిని క్రమముగ సుందరముగ రూపొందించుట కచటనచట ఒకింత కల్పనా సహాయము గైకొంటిమి. ఇదెల్ల మీయెదుట గలదు. దీని యందలి సరసమధురోపదేశ వాక్యములు భక్తరాజునివి, అందలి దోసగులు మావనియు తప్పక చెప్పవలసియున్నది.

ఈ పుస్తకమును ఆద్యోపాంతముగ సంశోధనచేయుట యందును, శైలిని సవరించుటలోను, కల్యాణ కార్యాలయ సంబంధీకులు శ్రీ చంద్రదీప త్రిపాఠి మా కత్యంత సహాయ మొసంగినందులకు వారికి మేము కృతజ్ఞులము.

వినీతుడు

మంగళ్



అంకితం:

వాత్సల్య భక్తిస్వరూపిణి,
శ్రీ కేశవప్రియజనని

శ్రీ యశోదాదేవికి.

ఓమ్!

# విషయసూచిక





శ్రీ సరస్వత్యైనమః

సీతారామ్

# భక్త నరసింహ మెహతా

## మహాత్ముని కృప

పుణ్యభూమియగు ఆర్యావర్తపు సౌరాష్ట్ర ప్రాంతమున జీర్ణదుర్గమను ప్రాచీననగరము కలదు. దానినే జునాగఢ్ అందురు. భక్తశ్రేష్ఠుడగు శ్రీ నరసింహ మెహతా సుమారు 1470 వ సంవత్సరమున జన్మించెను. ఆతని తండ్రి కృష్ణదామోదరదాసు. తల్లి లక్ష్మిగౌరి. జ్యేష్ఠ సోదరుడు వంశధరుడు. నరసింహరామునకు ఐదేండ్ల ప్రాయముననే తలి తండ్రులు పరలోకగతులైరి. నాటికి వంశధరునకు ఇరువది రెండు వత్సరములు. తదాదిగ నరసింహరాముని ఆతని నాయనమ్మ జయకుమారి పెంచి పెద్దవానిగ చేసినది.

నరసింహరాం బాల్యమునుండి మూగవాడు. ఎనిమిదేండ్లవరకు మాటలు రాకపోవుటచే అందరు నాతనిని మూగవాడని పిలువసాగిరి. అది జయకుమారికి చాల కష్టముగనుండెను. నా మనుమనికి మాటలెట్లు వచ్చునాయని యామె ఎల్లవేళల చింతించుచుండెడిది. మూగవానిని వాచాలునిగ చేయగలవారెవరు? కుంటివానికి పర్వతముల లంఘించుశక్తి నీయగలవారెవరు? ఆశక్తి కేవలము పరమపితయగు పరమేశ్వరునకే కలదని యామె పూర్తిగ విశ్వసించెను.

నా మనుమనికి చక్కని వాక్చతురత కల్గుననియు దయామయుడగు ఆ జగన్నాథుని కృప అతని భక్తులద్వారా పొందవలయునని ఆమె తలంచెను. ఆమెకు సాధువులు, మహాత్ములన్న సహజశ్రద్ధానురాగములు కలవు. ఎటనైన సాధువులు కన్పడిన వారల దర్శించి శక్త్యానుసారము శ్రద్ధతోడ సేవించుచుండెడిది.

శ్రద్ధ అధికమైన ఒకనాడు కాకున్న వేరొకనాడైన ఫలించునని పెద్దలనుడి. చివరకు జయకుమారి శ్రద్ధయు ఫలించు సమయ మాసన్నమాయెను. అయ్యది ఫాల్గుణ శుద్ధపంచమీ దినము. సుఖదసామ్రాజ్యమగు వసంతర్తువు ప్రపంచమంతట వ్యాపించుచుండెను. మంద వసంతవాయువులు సర్వజీవులందు నవజీవితమును నూతనోత్సాహమును కల్గింపజేయుచుండెను. గ్రామ మందలి స్త్రీ పురుషు లందరును అనుదినము నగరమునగల హాటకేశ్వరస్వామి ఆలయమున జేరి భజనలు సల్పుచుండెడివారు. ఆదినముకూడ యథారీతిని అందరును చేరిరి. జయకుమారియు తన మనుమని తీసికొని దేవుని సన్నిధికి వెళ్ళెను. దర్శనానంతరము తిరిగి వచ్చుచుండగా ఆమెదృష్టి అచటగల ఒక మహాత్మునిపై పడెను. అతడు దేవళమందలి ఒకచోట వ్యాఘ్రచర్మాసీనుడై నిరంతరము నారాయణ జపము సేయుచుండెను. అతని ముఖమందొక అపూర్వజ్యోతి వెల్గుచుండెను. ఆతడొక పరమసిద్ధుడగు యోగియని చూపరులకు వెంటనే తట్టును. ఆతని దివ్యతపఃప్రతిభచే జయకుమారి కూడ ఆకర్షింపబడి తనతోటివారలతో ఆమహాత్ముని చెంత చేరెను. దూరమునుండి ఆదరణతోడి మహాత్మునకు ప్రణ

మిల్లి "మహాత్మా! ఈ బాలకుడు నామనుమడు ఈతని తలి దండ్రులు మరణించిరి. ఎనిమిదేండ్లప్రాయము కలవాడైనను మాటలాడుట నేరడు. పేరు నరసింహరాం. అందరు వీనిని మూగి యనియే పిలుతురు. ఇయ్యది నాకు చాల బాధాకర మున్నది. వీనికి వాక్కు లభించువిధ మనుగ్రహింపుడు" అని ప్రార్థించెను.

గోస్వామి తులసీదాసు ఇట్లు వచించెను.

సంతహృదయ నవనీతసమానా! కహాకవిన్హాపరికహైన జానా
నిజపరితాపద్రవై నవనీతా। పరదుఖద్రవహి సంతగుణీతా॥

మహాత్ముల హృదయము వెన్నవంటిది. వెన్న కేవలము తన తాపముచే ద్రవించును. సజ్జనులు ఇతరుల దుఃఖము నకు ద్రవింతురు. ఈ మహాత్ముడు దైవశక్తిసంపన్నుడు. ఆ వృద్ధురాలి కోర్కెను నెరవేర్ప ఈశ్వరప్రేరితుడై వచ్చెనని తోచును. ఆయన బాలకుని తనచెంత కూర్చుండబెట్టుకొని ఆతని ముఖమును ధ్యానపూర్వకముగ చూచి "ఈబాలకుడు గొప్ప భగవద్భక్తుడు కాగల"డని పల్కి కమండలోదకము ఆతని శిరస్సుపై ప్రోక్షించి బాలకుని చెవిలో "బిడ్డా! రాధా కృష్ణ, రాధాకృష్ణ యని ఉచ్చరింపు" మనెను. ఆ మహా త్ముని శక్తిచే పుట్టుమూగియగు బాలకుడు "రాధేకృష్ణ రాధే కృష్ణ" యనసాగెను. అచటి వారెల్లరు ఆశ్చర్యచకితులైరి. మూగమనుమని నోట భగవన్నామోచ్చారణ విన్న వృద్ధు రాలి సంతోష మెవ్వరు వర్ణింపగలరు? ఆమె మహాత్ముని కెన్నో ప్రణతులు సేసి దీనతతో "స్వామీ! తమదయచే

నా మనుమనికి మాటలు వచ్చినవి. నా పెద్దమనుమ డీ రాజ్యమందు తాణేదారు. తమరొకమారు మాగృహమునకు విచ్చేయుడు. నేను తమకు యథాశక్తి సేవచేయు అవకాశమొసంగుడు. తమ పాదధూళిచే నాగృహము పావనము కాగలదని" ప్రార్థించెను.

నిజమగు మహాత్ములు బహూకృతులు, సేవలకై కాంక్షింపరు. వారు స్వభావసిద్ధముగనే లోకకల్యాణము నాసింతురు. మహాత్ముడు సంతోషమున "తల్లీ! నాకు యోగబలముగాని తపోబలముగాని లేదు. ఈ ప్రపంచములో ఏదియైనను ప్రభు కృపవలననే జరుగును. ఆ మహామహుని మాయ అఘటన ఘటనాపటిమ కలదని తెల్పబడుచున్నది. కాన నా ఉపకారముమరచి ఆ పరమాత్మునికే నీకృతజ్ఞతను తెల్పుము. ఆతని నామస్మరణ సల్పుము. నేను కారణము లేకయే ప్రతిష్ఠకొరకు గృహస్థు ఇంటికిరాను. నీ వింటికిబోయి ప్రభువును సేవించిన మేలు కల్గును. నేనిపుడు గిరినారు వెళ్ళుచున్నాను. నీమనోరథముచొప్పున ఈతనికి కొలది దినములలోనే కులీనురాలగు నొక సుందరకన్యతో వివాహము కాగల"దని పల్కెను.

జయకుమారికి మహాత్మునియెదుట బలవంతముచేయు సాహసము లేకపోయెను. ఆమె మనుమనితో ప్రసన్నవదనయై స్వగృహమున కేగెను. తన పెద్దమనుమడగు వంశీధరునికి మహాత్ముని విషయము వెల్లడించెను. ఆతడు మహాత్ముని దర్శనాపేక్షచే సిపాయిలతోడ వెదకించెను. కాని ఆతనిజాడ కానరాదాయెను. నరసింహామెహతాకు మంత్రోప

దేశముచేసి వాక్కును ప్రసాదించిన సిద్ధపురుషుడు స్వయముగ శ్రీకృష్ణభగవానుడే యని జనులు విశ్వసించిరి.



## కుటుంబ విస్తరణ

ఈకాలమందే హుమయూనురాజు భారతదేశమునేలుచుండెను. జునాగఢ్ అధిపతియగు క్షత్రియ రా జాతని అధీనుడు. ఆతనిపేరు రావమాండలిక్. హుమయూను అధీనమందున్నను రాచకార్యములందాతడు అన్నివిధముల స్వతంత్రుడు. కేవల మొక కప్పము మాత్రమే చెల్లించవలసియుండెను. ప్రభుత్వకార్యములలో ఆ కాలమున నాగరజాతివారు ప్రసిద్ధులు. రాజ్యమునందు ప్రధానమంత్రి మొదలు సామాన్య సేవకునివరకు నాగరజాతి జనులే యుండిరి. ప్రభుత్వోద్యోగములన్నియు వీరల హస్తంగతములయ్యెను. నేటికి కూడ వీరలకే రాజకీయరంగమందు హెచ్చుస్థానమున్నది.

వంశీధరు డట్టి జాతియందు జన్మించెను. నెలకు నూరు రూపాయల జీతముక్రింద ఠాణేదారు పదవి లభించెను. నౌకర్లు వాహనములు చాల ఉండుటచే, వారి కుటుంబజీవనము సుఖముగ గడచుచుండెను. సమాజగౌరవము ప్రతిష్ఠలుపెంపొందినవి. కాని ఏదైన లోపము చెప్పవలసినచో భార్యయగు దురితగౌరి స్వభావము మాత్రము దుష్టమని తెల్పవలసియుండును. ఆమెకు తన భర్త సంపాదనాపరుడని గర్వము. అబద్ధములతోడి కుట్రలుపన్నుట, ఇతరులబాధించుట ఆమెకు

నైజము. ఆమె దుర్గుణముల జూచిన ఆమె నామము అక్షర ముల నిజమని తోచును. "యథా నామ తథా గుణః" అను లోకోక్తి ఆమెయందు సంపూర్ణముగ చరితార్థమయ్యెను. అయినను సంసారము సుఖముగనే గడచుచుండెను.

మహాత్ముని కృపచే నరసింహారామునికి వాక్కు కలిగి నది మొదలు ఆతని నాయనమ్మ జయకుమారికి ఆతనికి వివాహము చేయ చింత మొదలిడెను. సాధ్యమైనంత శీఘ్రముగ తమ సంతానమును వివాహబంధనములో పడవేయుట భారత దేశపు తలిదండ్రులు తమ కర్తవ్యమని భావింతురు. ఈవిధ ముగ వారు సంతానఋణమునుండి శీఘ్రముగ విముక్తి పొంద వలెనని యత్నింతురు. జయకుమారియు ఈభావముననే నర సింహారామునికి వివాహ యత్నములు చేయసాగెను. కుటుం బము ధనగౌరవములుకలది. కాన ఆమెకు ఈ సంకల్పమున అచిరకాలముననే సఫలత కల్గెను. సుమారు తొమ్మిది సంవ త్సరముల ప్రాయముననే వారు నరసింహారాముని వివాహము 'మాణిక్ గౌరి' అను ఏడేండ్ల బాలికతోడ గావించిరి. మాణిక్ గౌరి సులక్షణ, సుగుణ. కాననే యోగ్యురాలగు తన మను మని భార్యను చూచి ఆమె సంతోషించినది.

వంశీధరుడు తన తమ్ముడగు నరసింహారాముని పెంచి వివాహముచేయుటయందేగాక విద్యల నేర్పించుటయందును శ్రద్ధవహించెను. ఆతడు నరసింహారాముని సంస్కృతము నేర్చుకొనుటకై ఒక పాఠశాలకు బంపెను. కాని నరసింహా రాముని మనసు చదువునందు లేదు. మహాత్మునిచే మంత్రో పదేశము జరిగినది మొదలుగా ఆతని మనసు అధికముగ భగ

వంతునిదెస మరలుచుండెను. ఆత డనవరతము రాధాకృష్ణ నామజపము చేసెడివాడు. ఉదయ సాయంసమయములందు మందిరములకు జని పూజలుచేయుట, భజనలు సల్పుట చేసెడి వాడు. (శ్రీ) శంకరునియందుగూడ ఆతనికి మిక్కుటముగుభక్తి గలదు. మందిరములలోనికిపోయి శ్రద్ధాభక్తులతో ఉమా మహేశ్వరుల పూజించుచు, తదానందమున మైమరచి భోలా నాథుని గుణగణములు గానముచేసెడివాడు. ఎటనైన పురాణ భాగవత కథాశ్రవణము జరుగుచున్న అటకుబోయి అమిత శ్రద్ధాభక్తుల వినెడివాడు. ద్వారకకు వచ్చెడు, పోయెడువారల శక్త్యానుసారము సత్కరించి వారల ఉపదేశముల గ్రహించెడి వాడు. భజనలు సల్పువారలతోడ తానును కరతాళముల భజనలు చేసెడివాడు. భావావేశమున ఎవ్వరైన నృత్యము చేయుట మొదలిడినచో తానును వారలతోడి నృత్యము సల్పెడివాడు. రాసక్రీడల సల్పు సంఘము లా నగరమునకు వచ్చినచో ఆతని సంతోషమునకు మేరయే లేదు. ప్రతిదినము రాసక్రీడలు చూచెడివాడు. రాధాలలిత మొదలగు సఖులు, మరియు వ్రజవనితల భగవత్ప్రేమనుగాంచి తన్మయుడయ్యెడి వాడు. తానుగూడ ఒక్కొకప్పుడు వారలతోడ చేరెడి వాడు. ఎన్నడైన రాసక్రీడలందు గోపికావేషము ధరించి నాట్యముచేయు సదవకాశము లభించిన, ఆత డపారానంద మనుభవించుచు కృష్ణప్రేమయందు నృత్యమధ్యమమున స్మృతి గోల్పోయెడివాడు. దీనియం దాతడు ఆహార పానీయముల గూడ మరచును. కొన్ని దినములవరకు ఇంటికైననుపోవడు. ఇందుచే అన్న వదినెల చివాట్లకు గురియై దెబ్బలు పడవలసి

వచ్చెడిది. సమాజము నిందించుచుండినను తన సహజ ప్రవర్తన విడువలేదు. అమృతస్వరూపమగు భగవత్ప్రేమరసమును చవిగొన్న వానిని ఎవ్వరు మరలింపగలరు? భగవత్ప్రేమమూలముగ చదువు సంధ్యలు, నిద్రాహారములు, ఆట పాటలు, నిందాస్తుతులు అన్నియు విస్మరించెను.

వంశీధరుడు తన అభిమతముచొప్పున ఆతనిని మరల్చ తలచలేదు. పదినె మాత్రము నరసింహరాముని, ఆతని భార్యను, తిట్టుట, ఈసడించుట, దెప్పిపొడుచుట, కష్టములు పెట్టుటయందుమాత్రము తక్కువచేయలేదు. కాని నల్లరంగు పైన ఇతరవర్ణములేవియు పట్టనటుల నరసింహరాముని నిర్దుష్ట వర్ణముపైని ఇతరవర్ణముల ప్రభావము చూపలేదు. మెల్లగ ఆతడు పదునైదేండ్ల ప్రాయము గలవాడయ్యెను. చదువు సంధ్యలు అబ్బవని గ్రహించగనే వంశీధరుడు, గుఱ్ఱములకు సేవచేయుట, గడ్డికోయుట మొదలగు కార్యములందు ఆతనిని నియోగించెను. కాని ఈ పనులవలన నరసింహరామున కెట్టి కష్టమును కలుగలేదు. ఆతడు సంతోషమున భగవన్నామ స్మరణ చేయుచు సర్వకార్యములను చేయుచుండెడివాడు.

పదునారేండ్ల వయసున నరసింహరామునికి ఒక పుత్రిక యును, రెండేండ్లపిమ్మట ఒకపుత్రుడునూ జన్మించిరి. పుత్రిక పేరు కుమర్ బాయి, పుత్రుడు శ్యామలదాసు. ఈవిధముగ నరసింహరాముని కిరువురు బాలల తండ్రియగు సౌభాగ్యము లభించెను. కాని వారల యీ సౌభాగ్యము దురితగౌరికి కంటకప్రాయమాయెను. ఏమియులేకనే మండిపడెడు దురిత

గారికి వారి కుటుంబవృద్ధి మరింత అసహనమాయెను. ఆ దంపతు లిరువురు ఎల్లవేళల పరిచారకులవలె రేబవళ్ళు సేవల చేయుచున్నను దురితగారికి వారలు తమఇంటబడి తినుచున్నారని బాధగనుండెను. దినదినము వారల కుటుంబవ్యయము కూడ అధికమగుచుండెను. ఆమె నిత్యము కారణరహితముగ వారి కార్యములందు తప్పులబట్టుచూ అబద్ధపు సాడీలను వంశీధరునికి నూరిపోసెడిది. వంశీధరునకు తనభార్య దుష్ట యనియు, ద్వేషప్రేరణవలననే తనతమ్ముని, ఆతని భార్యపైన దోషారోపణచేయుచున్నదని తెలియును. వంశీధరుడు నిర్దోషి, పవిత్రుడు. అయినను అప్పుడపుడు భార్య మాటలువిని తమ్ముని మందలించుచుండెడివాడు. ఈవిధముగ ఆకుటుంబము గృహచ్ఛిద్రములకు ప్రోవతీసెను.

జయకుమారికి ఈగృహకల్లోలములవలన కలుగు దుష్ట పరిణామము స్పష్టముగ ముందే కన్పట్టెను. కాని ఇంట మృత్యుశయ్యబడిన వృద్ధురాలి మాటలకు చెవియొగ్గువారెవరు? మెదలక ఆమె యన్నియు చూచుచుండెడిది. ఆమెకు తొంబదిఐదేండ్లు వచ్చినవి. ఒక దినమిట్లు తలపోసినది. "ఇపుడు నాకు మరణకాల మాసన్నమగుచున్నది. నరసింహాముని కుమార్తె వివాహము నాకండ్లఎదుట జరిగిన నాఅంతిమాభిలాష నెరవేరిన నేనిక శాంతితోడ ఈప్రపంచమునుండి సెలవు తీసికొనెద. ఆ బాలికకును ఒక తావు దొరకగలదు." ఒకదినమామె వంశీధరుని చేరబిలచి తన కోరికను తెలియజెప్పినది.

వంశీధరుడు వృద్ధురాలి ఆజ్ఞను త్రోసిపుచ్చలేదు. కులీనుడగు వరుని అన్వేషించుటకై తమ పురోహితునిపంపెను. పురోహితుడు దిమ్మరుచు కథియవాడ్ సమీపమునగల ఊనా యను గ్రామముచేరెను. అచట ధనాఢ్యుడగు శ్రీరంగ ధర మెహాతా పుత్రుడగు వసంతరాయునితో కుమార్ బాయి వివాహము నిశ్చయించెను. నిశ్చిత లగ్నమునకు వైభవోపేత ముగ కుమార్ బాయి వివాహము జరిగెను. వృద్ధురాలికోర్కె నెరవేరెను. మూడు మాసముల పిదప ఆమె ఈలోకమును వీడెను.



## శివుని అనుగ్రహము

అన్నగారి ఆజ్ఞానుసారము నరసింహారాము జాగ్రతతో పశువుల మేపుచుండెను. ఎన్నడును బుద్ధిపూర్వకముగ ఈ పనిని నిర్లక్ష్యము చేసెడివాడుకాడు. వీలు దొరికినపుడెల్ల భజనలు, పూజలు సల్పుచుండును. హరికథలకుగాని సత్పురు షుల సాంగత్యమునకుగాని పోవును. కాని వదినెకు సంతృప్తి లేదు. వారిని ఎల్లప్పుడు ఇబ్బందుల పెట్టుటకు ఏదోఒక ఉపాయ మన్వేషించుచునే యుండును. ఆమె దుష్టస్వభావ మెరిగినవాడగుటచే నరసింహారాము డామెను చూచి భయ పడెడివాడు. తనకార్యములం దెట్టి లోపము లేకుండ చేయును. అన్నగా రింటనుండు సమయముననే తాను ఇల్లుచేరును. వంశీధరు డుద్యోగధర్మమున ఎచటికైన పోయిన నరసింహా రామునకు ఆదినమున దుర్దశ ప్రాప్తించును. దురితగారికి

అన్నిదినముల కోపము ఆనాడు కూడుకొని సాధ్యమైన విధముల ఆ దంపతులను వేధించుచుండెడిది. అయినను భక్తరాజెన్నడును చలింపడు.

భగవద్గీతయందు భగవానుడిట్లు పల్కియున్నాడు.

"దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,
వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే."

ఎవరిమనము దుఃఖములను ఉద్వేగరహితముగను, సుఖప్రాప్తిని ఆసింపకుండగను, రాగభయ క్రోధములకు దూరముగను ఉండునో, వానిని స్థితప్రజ్ఞుడందురు. సరిగ ఈ విధముగనే భక్తరాజు శాంతితోడ సహించుచు, తనపనులను ఆనందపూర్వకముగ నెరవేర్చుచుండెడివాడు.

ఒకనాడు వంశీధరుడు రాచకార్యమున ఇలు వీడవలసి వచ్చెను. నరసింహరాము ప్రాతఃకాలమున గృహకార్యములను ముగించుకొని గడ్డికోయుటకై వెళ్ళి సాయంకాలము గడ్డిమోపును తీసికొని ఇంటికిచేరెను. గుఱ్ఱములకు గడ్డివేసిన పిదప స్నానముచేసెను. పగలంతయు తిరిగి తిరిగి శ్రమించి గడ్డికోయుటవలన ఆకలి పీడించుచుండెను. వదినగారిని అన్నమడిగెను. ఈమాటకు దురితగారి కసిరికొట్టి "ఆమహాభక్తుడు వచ్చినాడు. గడ్డికోయు నెపమున ఇలువెడలి పగలై బికారివారలతోతిరిగి ఇంటివిషయముల పట్టించుకొనక సాయంత్రము ఆకలివేయు చున్నదనును".

"నేడు నేను సాధువుల చెంతకు పోనేలేదు. ఉదయమునుండి గడ్డికోయుచునే యున్నాను. ఈదినములలో గడ్డి

కోయుటకు బహుదూరము అరణ్యములోనికి పోవలసివచ్చు చున్నది. అందువలన జాగైనది'' అని నరసింహారాం తన నిర్దోషిత్వమును ఋజువు చేయ జూచెను.

దురితగౌరి పాచిపోయిన రొట్టెలనుదెచ్చి అతనిచెంత విసరికొట్టెను. గృహమందనేక రకములగు తినుబండారములు ఉండెను. కాని నరసింహమెహతాకు అవియోగ్యములని ఆమె తలచలేదు. పతివ్రతయగు మాణిక్ బాయికి తోటికోడలి ఈప్రవర్తన సహింపలేని కష్టము కలిగించెను. సతి తన జీవిత సర్వస్వమగు పతిదేవుని దుర్దశ నెట్లు సహింపగలదు.? ఇతరుల దృష్టికాతడు అయోగ్యుడైనను ఆమె కెట్లగును? మాణిక్ బాయి హృదయము విదీర్ణమయ్యెను. ఆబాధ నేత్రములగుండ అశ్రురూపమున ప్రవహించెను. అంతకుమించి ఆతరుణమున నామె చేయగల్గిన దేమికలదు? ద్రవ్యోపార్జనయం దశక్తుడు, పరాధీనుడును అగు వాని భార్యకు ఇంట ఎట్టి అధికార ముండును?

నరసింహారాం క్షుద్బాధానివృత్త్యర్థమై కొలది రొట్టెల దిగమ్రింగి మంచినీరు ద్రావెను. దురితగౌరికి ఆతడట్లు తినుటకూడ అగ్నియం దాజ్యము పోసినట్లయ్యెను. "భజనలో సాధువు, భోజనమున భీముడు'' అని గట్టిగ ఆమె అరచెను. ఇంత తిండిపోతుతనమైనచో మా ఇంట జరుగదు. ఇన్ని కష్టములు నీ అన్నగారి కొరకైన నేను పడుటలేదు. పాప మాతడు ఏది ఉన్న అది తినిపోవును. ఇతని స్వభావమే వేరు. ఇప్పుడే స్పష్టముగ చెప్పుచున్నాను. ఎచట నీకు మంచి భోజనము లభించిన అచటనే తినుము. నేటినుండి నీకు

నాఇంట ఏపనియు లేదు. నేను చేసిపెట్టుటకు నీకు, నీభార్యకు దాసినిగాను అని ఈసడించెను.

అకారణముగ వదినె ఇట్లు మండిపడుట చూచి నరసింహారాం ఏమియు మాట్లాడ లేకపోయెను. మెదలక ఆమె మాటలను వినుచుండెను. కాని ఆతని మౌనమువలన దురితగౌరికి రోషము మరింత వృద్ధినొందెను. ఆమె రణచండి స్వరూపము ధరించి గర్జించుచు నోటికి వచ్చినట్లెల్ల తిట్టిపోయుచుండెను.

ఇంతలో వంశీధరుడు వచ్చెను. భర్తను చూడగానే దురితగౌరి మాటల మార్చివేసెను. రోదన చేయుచు " ఇంట నాపని ఏమియు లేదు. ఈ భక్తుడు, భక్తురాలితో నీవు సంతోషముగ నుండుము. దమ్మిడి సంపాదించలేడు. గర్వము మాత్రము మిక్కుటము నేనలసిపోతిని. ఈ ఇంట నరసింహుడైన ఉండవలె లేదా నేనైన ఉండవలెను" అని కేకలువైచెను.

మాయావియగు భార్యవలలోపడి సత్పురుషులుకూడ మర్కటము లగుదురు. పాపమిందు వంశీధరుని దోషమేమి? దురితగౌరిపక్ష మవలంబించి ఆతడుగూడ నరసింహారాముని తిట్టిపోసెను. తుదకు కఠోరముగ ఇంటనుండి వెడలిపొమ్మని ఆజ్ఞాపించెను.

ఇపుడు నరసింహారామునికి దిక్కెవరు? ఆతడు భార్యనచటనే వదలి ఉదాసీనమనస్కుడై ఇంటనుండి వెడలెను. ఊరిచివర ఒక అరుగుపై విశ్రమించెను. వైశాఖ శుద్ధ పూర్ణిమినాటి చంద్రుడు షోడశకళల ప్రకాశించుచు భూమిపై

అమృతము వర్షించుచుండెను. కాని నరసింహారామునకు మాత్రము శాంతిలేదు. కోప ముడిగిన పిమ్మట తన అన్న వచ్చి తనను పిలుచుకొని పోవునని అర్ధరాత్రివరకు నిరీక్షించి నిదురించెను. తెల్లవారెను గాని నరసింహారామునికై వచ్చిన వారెవ్వరును లేరు. అతడు తనలో ఇట్లాలోచింప సాగెను. "ఈ క్షణిక ప్రపంచమున సంబంధీకు లందరు స్వార్థముకొరకే ప్రేమింతురు. నిస్వార్థముగ ప్రేమించువాడు విశ్వంభరుడగు పరమాత్మ మాత్రమే. కాన నేనింటికి బోయి ప్రయోజన మేమి?". అరుగునుండి లేచి వేరొక చోటికి పోయెను. ఎక్కడకు, ఎందుకొరకు వెళ్ళుచున్నాడో ఆతనికే తెలియదు. పోయి పోయి ఊరికి పండ్రెండు క్రోసుల దూరమున గల అరణ్యమున ప్రవేశించెను. ఆకలి దప్పులచేతను, నడకచేతను డస్సి విశ్రమించుటకై యొక వటవృక్ష మూలము చేరెను. సాయంకాలమైన పిదప "ఇపు డెచటికి పోవలెనా" యని విచారింప సాగెను. ఈ ప్రపంచమున తనవా రెవ్వరు ? సర్వసంతాపహారి పరమకల్యాణకారియగు భోలానాథునికంటె ఆశ్రయమిచ్చు వారెవ్వరును లేరు. "ఎనిమిదేండ్ల నుండి నిత్యము శివపూజ చేయుచున్నాను. ప్రతి సోమవారము రుద్రాభిషేకము చేయుచున్నాను. శ్రావణమాస మంతయు మారేడు పత్రముల పూజించుచున్నాను. కనుక భక్తభయభంజనుడగు శంకర భగవానుడు నాకు తప్పక సహాయము చేయగలడు" అని తలచెను.

ఈ ఆలోచనలయందుండగా నరసింహారాముని దృష్టి చేరువగల ఒక జీర్ణదేవళముపై బడెను. అటగల రమ్య సరో

వరమునుచూచి ఆతనికి సంతోషముకలిగెను. శివాలయమునకు బోయి మారేడుపత్రములతోను పుష్పములతోను శంకరుని పూజించెను. శివలింగముఎదుట వెక్కి వెక్కి ఏడ్చుచు ప్రార్థింప మొదలిడెను. "దీననాథా! నాస్థితిపై నీకు దయ గల్గుటలేదా? అన్న వదినెలు నన్నింటనుండి వెడల నడచిరి. ఇంకమరి దిక్కెవరు? పుట్టినదాదిగ నిన్నేనమ్ముకొంటిని. నీ వాశ్రయమీయనిచో వేరెవ్వరీయగలరు? నీద్వారముకడ నుంటిని నన్ననుగ్రహింపుము. లేనిచో నేనన్నపానముల వదలి నీ యెదుటనే ప్రాణముల త్యజించెదను. ఈ బ్రహ్మహత్యా దోషము నీపై బడును."

నరసింహరాముని దృష్టిలో శివలింగ మొక శిలకాదు. ఆతనికది సాక్షాత్తు కైలాసపతి. కనుకనే నాతడు నిరంతరము విశ్వాసముతో తనబాధల దెల్పుకొనుచు రోదించుచుండెను. అరణ్యములో భయంకరమగు రాత్రి. క్రూరమృగము లనేక ములు గర్జించుచుండెను. అనేకములగు జంతువులువచ్చి మను ష్యుడగు నరసింహరాముని జూచి వెడలిపోవుచుండెను. కాని నరసింహరాముని కివియెల్ల తెలియవు. ఆతడఖిల భువనపతి యగు శంకరధ్యానమున నిమగ్నుడై అతనిని బిలచుచుండెను.

తెల్లవారెను. సూర్యభగవానుని రాకచే అంధకార ముడిగెను. అయినను నరసింహమెహతా ఆ స్థితియందే నేలపై శిరస్సునుంచి రోదించుచు ప్రార్థన చేయుచుండెను. తిరిగి పగలు గతించి రాత్రి సమీపించెను. రాత్రి పగలు, రాత్రి పగలు మారుచూ దినములు గడచిపోవుచుండెను.

ఆతడు మాత్రము తన శ్రద్ధాసంకల్పములనుండి లేశమాత్ర మైన చలింపలేదు.

ఈవిధముగా ఏడుదినములు ఉగ్రతపస్సుచే కైలాసపతి ఆసనము కదిలెను. ఏడవదినమున అర్ధరాత్రి భోలానాథుడు భక్తునియెదుట ప్రత్యక్షమాయెను. అతనిని చూచుటతోడన పరమపావనములగు ఆతని పాదపద్మములపై నరసింహారాము పడి ఇట్లనెను. "నా భోలానాథుడా! రమ్ము! నా శంభుడా! రమ్ము."

శంకరుడిట్లు పల్కెను. "బిడ్డా! నేను నీ సప్తదిన తప శ్చర్యకత్యంత సంతోషము కల్గినవాడనైతిని. నీఇష్టము వచ్చిన వరమొకదానిని కోరుకొమ్ము."

భక్తరాజు వినయముతో ప్రార్థించెను. "భగవానుడా! నాకు ఏవరమన్నను ఇష్టములేదు. అయినను వరమడుగుమని నీయాజ్ఞ కావున ఏవస్తువు నీకత్యంతప్రియమైనదో అదియే నాకు వరముగనిచ్చు కృపను దయసేయుము".

"వత్సా! నీవు మంచి వరమడిగితివి. ప్రపంచమున శ్రీకృష్ణునికంటె ప్రియమగు మరియొక వస్తువు లేదు. నీవు కోరినచో శ్రీకృష్ణుని దర్శనము చేయించెదను" అని శంకరుడు పల్కెను.

"భగవానుడా! ఈ దర్శనమే ప్రపంచమున అలభ్యమైనది. నీకత్యంతప్రియమైనదానిని ఎవ్వరు కాదనగలరు ?" అని నరసింహారాము నివేదించుకొనెను.

నరసింహరాముని నిష్ఠచూచి శంకరుడు చాల సంతోషించెను. ఆతడు భక్తరాజునకు దివ్యదేహమిచ్చి ఆతనిని వెంటనిడుకొని ద్వారకకు వెళ్ళెను.



## రాసదర్శనము

వృషభవాహనుడైన శంకరుడు భక్తరాజు సమేతుడై మాటలలోనే ద్వారకకు చేరెను, ఆదివ్యపురియొక్క అలౌకిక శోభ చూచి భక్తరాజు ముగ్ధుడాయెను. అయ్యది బంగారు భూమియని శంకరుడు తెల్పెను. అచటి గృహములు విద్రుమ మణిస్థగిత స్తంభములచే నిర్మితములు. గృహోపరిభాగములు రత్నఖచితములు. ఆదివ్యపురి నిత్యము నూత్నశోభ గల్గియుండును. అట సదా దివ్యప్రకాశము వెల్గొందుచుండును. అచటి ప్రకాశము చేతనే సూర్యచంద్రాదులకు జ్యోతి ప్రాప్తించు చున్నది. అచ్చోటగల ప్రకాశము సూర్యచంద్రాదుల కాంతులతో ఎట్లు పోల్చవచ్చును? కేవల మొక్క శ్రీకృష్ణుని నఖమణియే కోటిసూర్య సమానజ్యోతి గల్గియుండెను. ఇట్టి పరమధాముని దివ్యశోభగాంచుచు శంకరుడు ద్వారకాధీశుని రాజమహాలును చేరెను. ఆసమయమున శ్రీకృష్ణుడు కొలువుదీర్చి యుండెను. దేవకీనందనుడు, రాజరాజేశ్వరుడు అగు శ్రీకృష్ణుడు రాజసింహాసనముపై విరాజిల్లుచుండెను. అతని సభాసదులగు, ఉగ్రసేనుడు, బలరాముడు, అక్రూరుడు, ఉద్ధవుడు, విదురుడు, అర్జునుడు యథాస్థానములం

దాసీనులై యుండిరి. మరియు భగవంతుని పదునారేవేల గోపికలు, నూటయెనిమిది పట్టమహిషులు ఉండిరి. శంకరుని జూచి సభాసదులు లేచి నిలబడిరి. స్వయముగా శ్రీకృష్ణుడు లేచి శంకరుని స్వాగతమునకై పర్వులిడి చేతులుజోడించి శంకరుని ఒక దివ్యాసనముపై కూర్చుండ బెట్టెను. అటు పిమ్మట యథావిధిగ అర్ఘ్యపాద్యాదుల పూజించి రాకకు కారణ మడిగెను.

శంకరుడు "భగవన్! ఈతడు జునాగఢ్‌లోని ఒక ఉన్నత బ్రాహ్మణ కులోత్పన్నుడగు వైష్ణవ భక్తుడు. ఈత డేడుదినములు కఠోరతపస్సుచేసి నన్నను గ్రహ పరచెను. నేనీతనికి నాకు ప్రియమగు వస్తువొసగెదనని వరమొసగితిని. కావున నేడీ వైష్ణవ భక్తుని నీపవిత్ర పాదారవిందముల సమర్పించుటకు వచ్చితిని. నీవు భక్తవత్సలుడవు. భక్తాధీనుడవు. నాప్రార్థన తప్పక అంగీకరింతువని ఆశించుచున్నాను."

ఇదివిని శ్రీకృష్ణుడు సంతోషమున భక్తరాజు నరసింహారాముని శిరసుపై తనహస్తముంచి ఆతనిని స్వీకరించెను. శంకరుడటనుండి శెలవుగైకొని వెడలెను. భక్తరాజు ప్రేమచే గద్గదకంఠుడై శ్రీకృష్ణుని పాదములపైబడి తనకన్నీటిచే వానిని కడిగెను. భగవంతుడు భక్తరాజుని సంబోధించి ఇట్లుపల్కెను. "వత్సా! నాకును మహేశ్వరునికి ఎట్టిబేధములేదు. నేను శంకరుని ఆరాధ్యదైవముగ తలతును. ఆతడును నన్నట్లే తలచును. ఈ విధముగ మా ఇరువురియందు భేదములేదు గనుక శంకరుని నీవు ఆరాధించిన నన్నారాధించినట్లే."

"ప్రభూ! నాకేమి యోగ్యతకలదు? ఏట్లో అట్లు శంకరునికృపవలన "శ్రీకృష్ణః శరణంమమ" అనుశబ్దము మాత్రము నేర్వగల్గితిని." అని నరసింహారాం వినయముగ నివేదించెను.

"బిడ్డా! ఏమనుష్యుడు నన్ను ప్రభువునిగ తలంచునో నేను వానికి దాసుడనగుదును. నీ నైష్ఠికభక్తి చూచి నేడు నేను చాలసంతసించితిని." అని చెప్పి శ్రీకృష్ణుడు నరసింహారాముని తన అంతఃపురమునకు గైకొనిపోయి తనవైభవము నంతయు చూపెను.

అదిమొదలు నరసింహారాం స్వయముగ భగవత్సేవయందు మగ్నుడాయెను. ఆదినములలోనే శరత్కాలపూర్ణిమ వచ్చెను. శ్రీధామమందు రాసక్రీడలకై సన్నాహములు సల్పబడుచుండెను. ఆక్షణమందే బృందావనములోవలె అందమైన రాసమండలము తయారాయెను. పదునార్వేల గోపికలు పదునార్వేల శ్రీకృష్ణస్వరూపములు సముద్భవించెను. అదే సమయమున భక్తరాజుకూడ గోపీవేషమున తనరాగమాలాపించి ప్రభుగుణగానమున మైమరచెను. ఆతని భావావేశము జూచి కృష్ణుడు సంతసించి బహుమతిగ నాతని పీతాంబరము కప్పెను. పిమ్మట భగవానుడు శంఖము పూరించెను. క్రీడలారంభమాయెను.

భగవానుడు నరసింహారాముని చేతికొక దివ్వెనిచ్చి రాసమండల మధ్య నిలుచుండబెట్టెను. భక్తరాజు రాసక్రీడల చూచుటలో తన్మయుడయ్యెను. అకస్మాత్తుగ మండుచున్న దీపజ్వాల తన చేతికిగల వస్త్రమున కంటుకొనగా ఆతని

చేయి యంతయు దీపమువలె మండనారంభించెను. చేయియే ఒక దివిటీ అయ్యెను. కాని భక్తరాజున కీవిషయమే తెలియ రాదాయెను. ఆతని మనస్సు ప్రభువునం దైక్యమగుటచే శరీరభావము లేకపోయెను. కనుకనే అతడు ఏకాగ్రతతో తుదివరకు రాసక్రీడలు గాంచుచునేయుండెను. ఆతని మనసు ఒక క్షణమైన చలించలేదు. చివరకు రాసక్రీడ సమాప్తమైన పిదప స్వయముగ భగవానునిదృష్టి నరసింహరాముని మండు చున్న చేయిపై పడెను. వెంటనే ఆతడు ముందుకువచ్చి చేతి నంటుకొన్న నిప్పును చల్లార్చి ప్రేమతో నాతని చేతిని నిమిరి ఆతని బాధను తీసివైచెను. భక్తరాజునకు గల ఈ తన్మయత రుక్మిణి మొదలగువారల కాశ్చర్యము కలిగించెను. రుక్మిణి సంతసమున తన హారమును తీసి భక్తరాజున కొసంగెను. భగవానుడు భక్తరాజును పలుమారు ప్రశం సించి "నరసింహరాము నాతో సమానుడని తెలియుడి" అని చెప్పెను.

ఈవిధముగ ఆనందోత్సవములలోను భగవద్దర్శనము, భగవత్సేవలలో నిముసమువలె మాసముగడచి పోయెను. ఒకదిన మాతడు భగవంతుని చరణసేవచేయుచు తన సౌభా గ్యమునుగూర్చి ఇట్లు తలపోసెను.

"లక్ష్మికి, దేవతలకు, మునులకు దుర్లభమగు భగవం తుని చరణసేవచేయు అవకాశము లభించినందులకు నేనెంతో ధన్యుడను. ఈసౌభాగ్యము నావదినె కృపచేతనే గల్గినదికాన ఇది ఆమె ఉపకారమనియే తలంపవలెను."

భక్తరాజు ఈఆలోచనలోనుండగా ఆతనికి భగవంతుని వాక్కు వినిపించెను. "బిడ్డా! నీ ఏకాంతభక్తి, సేవలకు నే నెంతయు సంతసించితిని. నీకేమి కావలయునో కోరుకొమ్ము."

నరసింహారాము ఇట్లడిగెను. "భగవన్! నీవు నన్ను దుష్టుడవని తలచకున్న ఒక ప్రశ్న నడిగెదను. ఒక దరిద్రు నకు చింతామణి దొరకినను సామాన్య ధనికునివలె పేరాస ఉన్నచో ఆతని నేమనవలయును?" భగవంతుడు "అట్టివానిని అసంతోషి ... మూర్ఖుడు" అనవలయునని జవాబిచ్చెను.

"అయిన స్వామీ! నన్ను మూర్ఖునిగ ఏలచేయ తలచెదవు? చింతామణిసదృశమైన నీచరణకమలముల నొసగి తిరిగి ఇతరవస్తువుల నడుగుమని ఏల ఆశ చూపెదవు? నన్ను మాయలో పడవేయుకుము. నీచరణసేవ వినా వేరెద్దియు కోరుటలే"దని నరసింహారాము వినమ్రతతో బల్కెను.

"వత్సా! నీఇష్ట ధన్యమైనది. కాని జగత్తునందు ప్రతి గృహస్థునకు త్రివిధఋణము లున్నవి. స్త్రీపుత్రాదికఋణము మొదటిది. పితౄణము రెండవది. దేవఋణము మూడవది. మనుజుడు గృహస్థాశ్రమము స్వీకరించి ఎంతవరకీ ఋణముల నుండి విముక్తి పొందడో అంతవరకు నాతడు పునర్జన్మల పొందవలసి వచ్చును. కావున నీవు నాఆజ్ఞానుసారముగ మర్త్యలోకమునకు బోయి ఈ ఋణములనుండి విముక్తుడవు గమ్ము" అని భగవానుడు పల్కెను.

ఇది వినిన నరసింహారామునకు చాల కష్టముకలిగెను. భగవానుని విరహము ఆతనికి అసహనీయమాయెను. అతడు

సజలనేత్రములతో "ప్రభూ! నీ చరణధూళి పొందినపిదపకూడ ఏదైన ఋణశేషముండునా? ఇట్లు ఆజ్ఞ ఒసగి తిరిగి నన్ను సంసారకూపమున పడవేయకుము. నేను సంసారమునుండి భయపడి నీ పాదములచేరితిని. నీ చరణముల వదలి తిరిగి సంసారభారముల చిక్కువడ దలచను.'' అని పల్కెను.

భగవానుడిట్లు నుడివెను "నిజమే. నన్ను శరణు జొచ్చిన పిమ్మట జీవుడు సమస్త ఋణానుబంధములనుండి ముక్తుడగును. నీవుకూడ అట్లే ఎట్టి ఋణములేని వాడవైతివి. కాని లోకసంగ్రహముకొరకు ఋణములనుండి విముక్తుడవు కావలయును. నీవు పోయి సమస్తకార్యములు నాపూజయే యని భావించి చేయుము. నా ప్రతిమ నారాధించుము. నీవంటి ఏకాంతభక్తునకు మూర్తిపూజ అనవసరము. కాని నీధ్యానము కొరకు నేనొక ప్రతిమ నొసగుచున్నాను. ఈ ప్రతిమను పూజించుట వలన నీ భక్తి దృఢమగును. నీకీ కరతాళముల గూడ నొసంగుచున్నాడను. ఈ కరతాళముల నన్నెన్నడు నీవు కీర్తించెదవో అప్పుడే నేను నీవద్దకువచ్చి నీగృహస్థాశ్రమ సంబంధమగు కార్యముల చక్కబరచెదను. నాకీ ప్రతిజ్ఞ గలదు.

అనన్యాశ్చింతయంతో మాం ఏజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.
గీత 9 అ 22 శ్లో.

ఎవరు నన్ను అనన్యభావముచే నిష్కామభావముతోడ భజించెదరో వారి యోగక్షేమముల నేను స్వయముగా వహించుచున్నాను. ఎవ డీ ప్రతిజ్ఞను జ్ఞాపకమునందుంచు

కొని తదనుకూలముగ ఆచరించునో ఆతడు గృహస్థాశ్రమము నందున్నను ఎన్నటికిని దుర్గతిని పొందడు. కావున నీవు జునాగఢ్‌నకు పోయి నన్ననన్య భావమున భజింపుము.

భగవంతు డీవిధముగ ఓదార్చుటచే నరసింహరాము డంగీకరించెను. భగవంతు డాతనికి తన ప్రతిమ, కరతాళములు, పీతాంబరము, నెమలిపింఛపు కిరీటములను ఒసగెను. నరసింహరాముడు భగవంతుని చరణములకు ప్రణమిల్లి బయలుదేరి వెంటనే జునాగఢ్‌నకు చేరెను.



## అనన్యాశ్రయము

ప్రాతఃకాలసమయము. భాస్కరుడు తన ఉషఃకాల ప్రకాశముచే దశదిక్కులను సువర్ణమయముగ చేసెను. ఇదే సమయమున నరసింహరాముడు జునాగఢ్ సమీపమున గరుడాసనమునుండి దిగెను. సమీప తటాకమున స్నానాది నిత్య క్రియలు సల్పి కొంతసేపు భగవంతుని భజనచేసెను. పిమ్మట "ఎక్కడికి వెళ్ళుదునా? అని ఆలోచింపసాగెను. అన్న వదినెలు నన్నాదినముననే వెడలగొట్టిరి. ఇప్పుడు నన్నేల స్వీకరింతురు? కాని వారుతప్ప నాకింకెవరుగలరు? నన్నవమానపరచనిమ్ము అయినను వారిచెంతకే పోవలయును."

ఆతనివద్ద భగవంతుడొసగిన ప్రతిమ, కరతాళములు, నెమలిపింఛపు కిరీటము, పీతాంబరము తప్ప వేరెవ్వియు లేవు. ఈవస్తువులతోడి వైష్ణవవేషమున ఆత డింటికి చేరెను. విన

యముతోడి అన్నవదినెలకు నమస్కరించెను. ఆతని ఈ వేషము చూచి వంశీధరునికి క్రోధము, ఆశ్చర్యముకూడ కలిగెను. క్రోధమున ఇట్లుపలెక్కెను. "మూర్ఖా! ఇదేమి వేషము? నుదుట బొట్టు, మెడలో మాల, కరమున తాళము, శిరమున నెమలి పించ కిరీటము, నడుముచుట్టు పీతాంబరము—ఈ వేషము నీ కెవరొసంగిరి? వీనిని తీసి ఆవల పారవేయుము."

నరసింహారాముడు బహువినయముతోడ ఇట్లనెను. "అన్నా! ఇట్లేల బలెక్కెదవు? ఈ వేషము వైకుంఠవాసి శ్రీభగవానుడు స్వయముగ ఒసగినాడు. నాకిదియే ఆతని పవిత్ర ప్రసాదము. భగవంతుని ప్రసాదము నిందించుట స్వయముగ భగవానుని నిందించినట్లే."

వంశీధరుడు తిరస్కృతితో "ఓరీమూర్ఖా! ఏల ఈవదరు బోతు మాటలు? నీపిచ్చి మానుము. నీవు పసివాడవుకావు. ఇరువురు పిల్లలతండ్రివి. ఈబికారి వేషమువదలి రెండుడబ్బులు సంపాదించు ప్రయత్నములు చేయుము. నలుగురిలో నన్ను ముఖము ఎత్తుకొనలేనట్లు ఏలచేసెదవు? ఈనడకమాని మంచి త్రోవకు ఇప్పుడైననురమ్ము. రాజుగారికి తెల్పి మంచి నౌకరీ ఇప్పించగలను. ఈపిచ్చితనమున ఏమున్నది? ఆకలిచే మరణింపవలసి వచ్చును."

"సోదరా! నీవు పెద్దవాడవు కాన నాకు పితృసమానుడవు. నీమాట మన్నించుటయే నాధర్మము. కాని నేనుచేయగల్గిన దేదియులేదు. ఈ వేషము పరమాత్మ ఒసగినదియే. ఈవస్తువులన్నియు ఆతని ప్రసాదరూపమున నాకు లభించినవి

కావున నాకు ప్రాణములకన్న మిన్నయైనవి. వీనిని నేను బ్రతికియుండగ విడిచిపెట్టజాలను. ఇది పిచ్చితనమే కానిమ్ము. పారిపంచికదృష్ట్యా ఇది పిచ్చితనమే. కాని ప్రాపంచికపుదృష్టి వేరు. ప్రపంచమునకు సత్పురుషులు బుద్ధిహీనులవలె కన్పట్టుదు రనుట ఇతిహాసములవలన తెలియవచ్చుచున్నది. ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు మందునివలె తలంచలేదా? రావణుడు విభీష ణుని మూఢునిగ భావించలేదా? నామూఢత్వమును నీవు క్షమింతువని ఆశించుచున్నాను" అని నరసింహరాము నిర్భీతిగ జవాబిచ్చెను.

"మూర్ఖా! నాకేదియో నీతులబోధింప దలచెదవేల? భగ వంతుడు నీకై ఎచట వేచియున్నాడని నీవుపోయి కలసికొని వచ్చితివి? నీవంటి బుద్ధిశాలుర కాతడు దర్శనమొసంగ నారం భించినచో ప్రపంచమే శూన్యమగును. వైకుంఠమున ప్రవే శించుటకు తావేదొరకదు. నీకు తెల్పినవాడెవడో ధూర్తుడు.

జైసే కో తైసామిలా । ఇస్మే కాఛ నవాయీ
మూరఖ్ కో మూరఖ్ మిలా । ఆవో మూరఖ్ భాయీ!"

నరసింహా! నీ మూర్ఖత్వమును విడువుము. లేకున్న చాలా పశ్చాత్తాపపడవలసి వచ్చును. జ్ఞాతులుగాని సంబంధీ కులుగాని మనకు సహాయపడరు. పిల్లపెండ్లి ఎట్లోఅయినది. కాని పిల్లవానిపెండ్లి యగుట కష్టమగును. వివాహము కానిచో మన కులము నీచముగ తలంచబడును." ఇంకను వంశీధరుడాతనికి స్పష్టపరుప యత్నించెను.

"సోదరా! నన్ను మూర్ఖునిగనే ఉండనిండు. పరమాత్మను భజించిన నీకులము నీచమైన నాకట్టికులముతో ఎట్టి సంబంధము లేదు. నాకు భగవంతుని.........".

ఇంతవరకు దురితగౌరి సోదరులిరువురి సంభాషణ వినుచున్నది. కాని ఇపుడు నరసింహారాముని పట్టుదల ఆమెకు అసహ్యముగ దోచెను. ఆతనిమాటల కడ్డమువచ్చి రోషపూర్ణవచనముల ఇట్లు పల్కెను. "ఇడిగో చూడుడు. పెద్ద బొట్టుపెట్టికొని భక్తరాజు వేంచేసియున్నాడు. పెద్ద చిన్న యను మర్యాద లేదు. లక్షచెప్పినను తన జ్ఞానకథనము మానడు. నేటివరకు ఇంట పోట్లాట లేదు. నేను రాగానే పోట్లాట ప్రారంభమైనది. నీజ్ఞానమునకు నీకు ఒకనమస్కారము. నిన్ను మావద్దనుంచుకొని మావంశమర్యాదకూడ పోగొట్టుకొనలేము. ఈ వేషముమార్చి మంచివానివలె మాఇంటనుండుము. లేదా మాకింక నీముఖము చూపవలదు. నేను చేసిపెట్టుటకు మీకు ఋణపడి యున్నదానను కాను. నీకేమైన సిగ్గున్నచో నీభార్యను తీసికొని వెడలిపొమ్ము. ఇంతవరకు ఆకలితోడి ఎక్కడ మాడుచున్నాడో? తిరిగి నాప్రాణము తీయుటకు అవతరించినాడు."

"వదినా! ఇంత కఠోరవాక్యము లేల? మీకు నాకుటుంబపోషణ భారముగ కన్పట్టిన రేపటినుండి విడిగనే యుండెదను. నీవు వ్యర్థముగ మనసున బాధపడవలదు. నేను నిన్ను మాతృసమానముగ చూచుకొనుచున్నా"నని వినమ్రతతో నరసింహారాముడు పల్కెను.

"నీగర్వము నాకు తెలుసును. నీకంత కోర్కె ఉన్నచో శేపేల? నేడే ముహూర్తము మంచిది. నీవు సంపాదించినది ఇక్కడ ఏమియు లేదు. నీవిపుడే వేరుపడుము. నీవు గొప్ప భక్తుడుగ వచ్చినావు. ఏదేని యనినచో నీకు విచారముగ నుండును" అని దురితగారి ఈసడించెను.

దురితగారి శీఘ్రముగ వేరుపడుటకు సంసిద్ధురాలగు చున్నదన్న విషయము నరసింహారాము గ్రహించెను. కలసి ఉండెదమని తెల్పుట వ్యర్థమని తలచెను. భగవంతునిపై భారము వైచి ఈ ఇంటినుండి వెడలుటయే నా కుచితమైనది అని తలపోసెను. ఆతడు తన ధర్మపత్ని, పదునారేండ్ల పుత్రిక, పుత్రునితో వేరగుటకు సిద్ధపడెను. అతడు వంశీధరునితో "అన్నా! నేను మీ ఆజ్ఞను శిరసావహించి నే నిపుడే వెళ్ళు చున్నాను. తమరు పూజ్యులు. నేను నాధర్మమును పరిపాలించుటయందు సమర్థుడగునటుల ఆశీర్వదింపుడు. తమరు మనసునందు అన్యభావముల ఉంచవలదని ప్రార్థించు చున్నాను. నన్ను సదా తమ్మునిగ చూచుచు అనురాగము కలవాడ వైన నేను కృతార్థుడ నగుదును. శెలవు" అని చెప్పి అన్నకు నమస్కరించెను.

మాణిక్ గారియు దురితగారికి నమస్కరించి "అక్కగారూ! నన్నాశీర్వదించండి" అని అడిగెను. వంశీధరుడు మాట్లాడనే లేదు. దురితగారి "సీ తెలివితేటలు చూపకు. ఈనాటితో నీకునూ నాకునూ సరి. నీవింకపోయి భిక్షమెత్తినను సరే, సింహాసన మెక్కినను సరే, మాకేమియు సంబంధము

లేదు. మా సంసారుల కీ జ్ఞానబోధతో నిమిత్తము లేదు. ఎవరైనను భిక్షుకులతో తెల్పుము" అని త్రిప్పికొట్టెను.

మౌనము అంగీకార సూచనముకదా! వంశీధరుడు ఇంతవరకు మౌనముగనే యుండెను. ఇంతకుమించి ఆతడును చెప్పవలసినది లేదు. నరసింహరాము ఆయింటనుండి కుటుంబ సమేతముగా వెడలెను. ఆతని మనమున హర్ష శోకములు లేవు. భగవద్గీతలో "ఎవని మనము దుఃఖము కల్గిన ఉద్వేగము చెందదో, సుఖములు పొందవలెనని కాంక్షింపదో, ఎవనికి రాగభయక్రోధములు అంతరించినవో ఆతడు స్థితప్రజ్ఞుడనబడుచున్నాడు." సద్భక్తునిస్థితి ఇట్టిది. నరసింహరాము డిట్టివాడే. ఆతనిది స్థిరబుద్ధి.

కాని స్త్రీల హృదయము కోమలము. కొద్దికష్టము కలుగగనే నేత్రము లశ్రుపూరితములగును. భక్తరాజు పత్ని మాణిక్ బాయి ఇల్లు వీడగనే ఏడ్వనారంభించెను. కొలది దూరము వెళ్ళినపిదప ఆమె గద్గదకంఠముతో "నాథా! ఇపుడు మన కెవరు ఆధారము?" అని విలపించెను. "ప్రియా! దుఃఖంపకు. ఆపదలే మనుష్యునికి గీటురాయి. శోకించుటకు కారణములేదు. ఊరిబయటగల ధర్మసత్రములో నివసింతము. ఏపరమాత్మ చీమనుండి ఏనుగవరకు ప్రాణుల పోషించుచున్నవాడో, అట్టివాడు మనలనుమాత్రము పోషింపజాలడా? మనల దుఃఖింపజేయునా? ఆ ధర్మశాలవద్ద ఒక జలాశయము, మందిరము కూడ గలవు. అచట కనీసము స్నానధ్యానములకైనను ఆటంకము గల్గదు" అని నరసింహరాము దృఢముగ బల్కెను.

"ప్రాణేశా! ధర్మశాలలో బాటసారులు, సాధువులు, ఫకీర్లు నివసింతురు. గృహస్థులు ధర్మశాలలో ఉండుట మంచిది కాదని తోచుచున్నది. మన నాగరజాతి చాల ద్వేషము కలది. ఈవిషయము ఆలోచింపవలసినదే" అని మాణిక్ బాయి లౌకికముగ మాట్లాడెను.

"ప్రియా! ఈ ప్రపంచమే ఒకరకమగు ధర్మసత్రము. ఏవిధముగ సత్రములోనికి బాటసారులు వచ్చుచు పోవు చుందురో అదేవిధమున ప్రపంచమునగూడ జీవులు వచ్చుట పోవుట జరుగును. రాజు మొదలు పేదవరకు అందరికిని కలుగు స్థితియే యిది. దీనియందు విచారింపవలసిన విషయమేమియు లేదు" అని నరసింహరాము తాత్వికముగ పల్కెను.

"సరే మీఇష్ట" మని పతివ్రత మాణిక్ బాయి మిన్న కుండెను. భక్తరాజు సకుటుంబముగ ఊరిబయటగల ధర్మ సత్రమున దిగెను. భగవంతు డొసగిన ప్రతిమ, కరతాళ ములు, ముకుటమే ఆతని కుటుంబమునకు గలసంపద. సాయం సమయము కాగనే భక్తరాజు భగవంతుని ప్రతిమ ఎదుట కూర్చుండి ప్రేమపూర్వకముగ భజనసేయుచుండెను. నేత్ర ముల వెంబడి ప్రేమాశ్రువులు ప్రవహించుచుండెను.

అర్ధరాత్రివరకట్లే భజన చేయుచుండెను. పిమ్మట భజననాపి నరసింహరాము శయనింపబోవు యత్నమున నుండగ ధనికవర్తకు డొకడువచ్చి నరసింహరాముని సమీ పించి నమస్కరించి కూర్చుండెను.

నరసింహరాము ఏ మనుజునైన హరియొక్క జనునిగ (హరిజనునిగ) భావించును.

"హరిజన్! తమరెక్కడ నివసింతురు?"

"భక్తరాజ! నేను యాత్రకై వచ్చిన పరదేశిని. తమ కథ వినిపింపుడు."

నరసింహరాము ఆదినుండి అంతమువరకు ఇంటజరిగిన వన్నియు తెల్పెను. సత్పురుషుల హృదయములో ఎట్టిదాపరికమును ఉండదు. వణిజుడు నరసింహరాముని స్థితిపై జాలి గలిగి "భక్తరాజా! తమస్థితి నాకు చాలకష్టము కల్గించినది. తమరు అన్యథా భావించకున్నచో నేను తమకు సేవచేయ తలంచుచున్నాను."

"వణిజశ్రేష్ఠా! నేను నీకు కృతజ్ఞుడను. కాని ప్రథమమున నేను తమపూర్తిపరిచయము తెలిసికొనగోరుచున్నాను" అని నరసింహరాము తెల్పెను.

"భక్తశిరోమణీ! తమకోర్కె ఇది అయినచో తెల్పుచున్నాను. తమవద్ద దాచవలసిన పనిలేదు. నేను అక్రూరుడను. శ్రీకృష్ణభగవానుడు నీ గృహ నిర్వాహ విషయము విచారించుచున్నాడు. కనుక తమవద్దకు నేను వచ్చితిని. తమకేది కావలెనన్న నిస్సంకోచముగ నాకు తెల్పుడు" అని అక్రూరుడు పల్కెను.

భగవంతుని అకస్మికకృపజూచి భక్తరాజు గద్గదుడాయెను. "యోగక్షేమం వహామ్యహం" అను భగవంతుని వాక్యము సర్వవిధముల సత్యమని ఆతనిమనస్సున నిశ్చయముకల్గెను. కొలదికాలము కృతజ్ఞత తెల్పి భగవంతుని స్మరించి తత్ప్రేరణచే భక్తరాజిట్లు పల్కెను. "మహారాజా! నివసించుటకొక

గృహము, జీవనరక్షణకు అన్నపానాదులు. సాధుసేవకు అవసర మగుసామగ్రి ఇంతకుమించి నాకేమియు అవసరము లేదు."

"మంచిది. ప్రాతఃకాలము కాగానే తమ ఆజ్ఞానుసారము అన్ని ఏర్పాట్లు జరుగగలవు. ఇంకనేమియు చింత లేదు గద" అని అడిగెను.

"ఇక మరేచింతయు లేదు. ఒకవేళ ఈశ్వరేచ్ఛచే వేరెట్టి చింతయైనకల్గిన అది భగవంతునికిని, నీకును తెలియు గలదు." అని భక్తరాజు తననిశ్చింతతను ప్రకటించెను.

భక్తరాజు నిశ్చింతత, నిర్లిప్తత చూచి అక్రూరు డాశ్చర్య చకితుడయ్యెను. ఆతని గంభీరోక్తులు విని నవ్వుచు, ఆతని వాక్చాతుర్యమును ప్రశంసించెను.

మరునాడు ప్రాతఃకాలమున నరసింహరాము స్నానాది నిత్యకర్మలు గావించినపిదప భజనలోనుండగా అక్రూరుడు మనుజవేషమున కావలసిన ఏర్పాట్లన్నియు గావించెను. వసించుటకు అత్యంతసుందరమగు భవనమొకదానిని ఆతడుకొనెను. అన్నవస్త్రములు, తదితర గృహోపకరణములు కొనెను. ఏర్పాట్లు పూర్తియైనపిదప అక్రూరుడు భక్తరాజునకు "భక్త రాజా! తమ ఆజ్ఞానుసారము అన్నియు సిద్ధముగ నున్నవి. తమరుచూచి తమ అభిప్రాయము తెల్పుడు." అని చెప్పెను.

"నాఅభిప్రాయమేమి? మీఅభిమతమే నాఅభిమతము. కేవలమొక అయిదువందల సాధువులు గూడి భగవంతుని భజించు నేర్పాటాయింటనుండినఁ జాలు"నని నరసింహరాం పల్కెను.

"మీరొక పర్యాయము వచ్చి చూడుడు. ఏర్పాట్లన్నియు పూర్తియైనవి." అని అక్రూరుడు బదులుపల్కెను,

భక్తరాజు కుటుంబముతోఁగూడ ఆగృహమునకు వచ్చెను. గృహమున శ్రీకృష్ణ మందిరము, కీర్తనశాల, పాకశాల, అతిథిశాల మున్నగునవన్నియు సిద్ధముగ నుండెను. వంటశాలయందు మూడేండ్లకు సరిపడు భోజనసామగ్రి నింపబడి యుండెను. ఏవస్తువున కెట్టి కొఱతయు లేదు.

భక్తరాజా! శ్రీకృష్ణభగవానుని యాజ్ఞానుసారమే ర్పాట్లన్నియు జరిగినవి. ఈ అయిదువేల సువర్ణముద్రలు మీకు ఖర్చుకై యొసంగుచున్నాను. ఇక నాకు శెలవిండని అక్రూరుఁడుఁ బల్కెను.

భగవద్భక్తుఁడు భగవత్స్వరూపుడు. పరమభాగవతుడగు నరసింహరాము అక్రూరునకు వెంటనే శెలవు ఎట్లీయగలఁడు? ప్రేమచే నాతని నేత్రము లశ్రుపూరితములాయెను. నోట మాట రాకుండెను. ఎట్టకేల కంగీకరించెను.

అక్రూరుడు శెలవు దీసికొని కృష్ణభగవానుని వద్దకు వెళ్ళెను. మాణిక్ బాయి వంట తయారుజేసెను. భక్తపరివారము భగవంతునకు నివేదనజేసి యమృతస్వరూపమగు ప్రసాదమును స్వీకరించిరి.

మాణిక్ బాయి యానందముగ నిట్లు బల్కెను. ప్రాణేశ! మీ వచనములు అక్షరముల నిజమయ్యెను. మీ భక్తిప్రభావముచే సర్వము సమకూడినది.

నరసింహరాము "ప్రియా! ఇందాశ్చర్యమేమిగలదు? మనుజుని మనుజుడెప్పుడూ రక్షించలేడు. పరమపితయగు పరమేశ్వరుడే జగత్పోషకుడు. ఎవడు భగవంతుని అనన్యభావమునభజించునో చింతాశోకము లాతనిచెంతజేరవు. శ్రీకృష్ణుడు స్వయముగ నిట్లు బల్కియున్నాడు. "ఎవరు నన్ననన్యభావమున భజించుచు నన్నుపాసన జేయుచున్నారో వారి యోగక్షేమముల నేనే వహించుచున్నాను." ప్రియా! భగవంతుని అనన్యముగ భజించుటయే మన కర్తవ్యము."

—*—

## కుమారబాయికి కల్యాణం

నరసింహరాముని జీవిత మేకాంతభజనముల గడుచుచుండెను. సాధు సమ్మేళనమునకు బోవుట, సత్సాంగత్యము సేయుట, భజనలు సల్పుట – ఇదియే యాతని నిత్యకర్మలు. భగవద్భక్తుడెవడైన నతనిని తమగృహమునకు భజనలుసేయుటకు రమ్మని బిలచిన నాత డత్యానందమున నంగీకరించును. ఇంతియేగాక నాతనియింట సదా సాధువులు జేరుచునే యుందురు. వారల కీతడు విరివిగ దానములు జేయుచుండును. ఆతని కార్యములు భగవద్భజన, సాధుసేవ. ఇవి వినా వేరొండెద్దియు లేవు.

వచ్చు రాబడి లేక వ్యయ మిష్టమువచ్చినటుల సల్పుచున్న కుబేరుని ధనాగారమైనను నంతమగును. ఇతరులసంగతి జెప్పనేల? ఈ కారణముననే మూడేండ్లకు సరిపడు అక్రూరు

దాసగిన సామగ్రి ఆరుమాసములలోనే నరసింహరామునకు ఖర్చయ్యెను. ఇంటగల వస్తువులనమ్మి భగవంతునికి నివేదన సేయుగతి బట్టినది. ఇట్లెంతకాలము గడచును? కొద్ది దినములలోనే ఆ కుటుంబమునకు గల కొలది సామగ్రి పూర్తి ఆయెను. ఇపుడు కుటుంబము గడచుటే కష్టముగ నున్నది. ఇంత కష్టముగల్గినను భక్తరాజున కెట్టి చింతయు లేదు. ఆతనికి కలయందైనను రేపు ఏమగునన్న బాధలేదు. జరుగవలసిన దెట్లున్న అట్లే జరుగును. ఆతను మాత్రము నిత్యము భజనలందే మునిగి తేలుచుండెను.

క్రొత్తయాపద ఒకటా దినములం దాతనిపై బడెను. ఊనా నుండి శ్రీరంగధర మెహతా పురోహితుడు కుమారబాయిని గొంపోవుటకు వచ్చెను. ఆదినమున ప్రాతఃకాలముననే భక్తరాజెచటికో భజనజేయుటకు పోయియుండెను. మెహతాగారెచటికి వెళ్ళిరని పురోహితు డడిగెను. భజన మందిరమునకు వెళ్ళిరని మాణిక్‌బాయి వంటచేయుచు పల్కెను.

పురోహితుడు తన పేరు, ఊరు, వచ్చుటకు కారణమును సవిస్తరముగ తెల్పెను. మాణిక్‌బాయి యథోచితముగ ఆదర సత్కారములను గావించెను. పురోహితుడాసనముపై ఆసీనుడాయెను.

మాణిక్‌బాయి కుమార్తె ఎడబాటును తలచుకొని చాల విచారించెను. "ఇపుడెట్లు? భక్తరాజు రేయింబవళ్ళు భక్తిలోనే మునిగి తేలుచున్నాడు. ఇంటివిషయము లేవియు పట్టించుకొనడు. రోజులు గడచుటయే కష్టముగ నున్నది.

ఇక కుమారబాయికి కట్న మెట్లువచ్చును? కట్నమివ్వకయే పుత్రికను బంపిన సాటివారిలో అప్రతిష్టగ నుండును."

కొంతసేపటికి మెహాతా ఇంటికి వచ్చెను. అప్పటికి వంట సిద్ధముగ నేయుండెను. ఆతడు వచ్చుటే జాగైనది. వచ్చుచునే ఆతడు "సతీ! నివేదనజేయుట కింకను ఆలస్యమున్నదా?" అని ప్రశ్నించెను. "ఆలస్యమేమియు లేదు. తీసికొని వచ్చుచున్నా"నని పల్కుచు మాణిక్ బాయి నివేదన సామగ్రినంతయు యొక పళ్ళెమున గైకొని వచ్చెను. భక్తరాజు భక్తిపూర్వకముగా భగవంతునకు నివేదన చేసెను. పిమ్మట భోజనమునకుసిద్ధమైరి. "ఈదినమున నెవరైన సత్పురుషులు వచ్చిరా?" అని భక్తరాజడిగెను.

మాణిక్ బాయి "ఎవరు రాలేదు. ఒకఅతిథి మాత్రము వచ్చె"నని బదులు పల్కెను.

మెహాతాగారు నవ్వుచు "అక్రూరుడు రాలేదా?"అని అడిగెను.

"లేదు. శ్రీరంగధరమెహాతా పురోహితుడు కుమారబాయిని తీసికొనివెళ్ళుటకువచ్చిరి. పుత్రికనుపంపుటకు వలయు కట్న కానుకలకై షుమారు నూరు రూప్యములయినను కావలయునను చింతతో నున్నాను. ఒక రూపాయిగూడలేని ఈ స్థితిలో నూరు రూపాయిలు లభించుటెట్లు?" అనుచు మాణిక్ బాయి నిట్టూర్చెను.

చింతపడెడి భార్యతో భక్తరాజిట్లు పల్కెను. "సతీ! నేను, నాది యను మమకారమున ఏల చింతాక్రాంతవయ్యె

దవు? ఈపుత్రికా పుత్రులకు మనము నామమాత్రమునకే తల్లిదండ్రులము. వాస్తవముగ మనకందఱకు శ్రీపతియగు భగవానుడే తండ్రి. అతడు సర్వసమర్థుడు. మనము వ్యర్థముగ చింతిల్లనేల? ఆ భారమంతయు అతడే వహించును. స్వయముగ అన్ని ఏర్పాట్లు చేయగలడు.”

“నాథా! రేపే అమ్మాయిని పంపవలెను. ఇంతవఱకు వస్త్రములకైన శికాణా లేదు. పరమాత్మ ఎట గలడని సమయమునకు ఆమె కన్నివస్తువులు ఇచ్చును? ఊరు, పేరు లేనివానిని నమ్ముటెట్లు?” అని పల్కుచుండ దుఃఖమున ఆమె నేత్రము లశ్రుపూరితములయ్యెను.

భక్తరాజిట్లు పల్కెను. “ప్రియా! నేను, **నాది** అనెడి ఈ రెండుశబ్దములే మాయానిర్మితములు, దుఃఖకారణములు. విరాగులు, యోగులు, యతీశ్వరులు, మహారాజులు అందరు ఈ మాయాజాలమున చిక్కువడియున్నారు. కనుక అహంకార, మమకార త్యాగమే సంసారత్యాగము. విను.

(ప్రభాత్)

“సమరనే శ్రీహరి మేల మమతా పరీ।
జోనే విచారీనే మూల తారూం॥
తుం అల్యాకోణనే కో నేవళగీరహ్యో,
వగర సమజే మ్హారూం మ్హారూం
దేహ తారీ నథీ జో గతే కరీ।
రాఖతాం నవ రహే నిశ్చే జాయే॥
దేహ సంబంధ తజే అవనవా బహుథశే।
పుత్ర కళత్ర పరివార వ్హాయే॥

ధన తణుం ధ్యాన తుం అహోనిశ ఆదరే।
ఎజ తారే అంతరాయ మోటీ॥

పాసే ఛే పియు అల్యా త్రేనే నవ పరఖియో।
హాథథీ బాజీ గయీ థయారే ఖోటీ॥

భరనిద్రా భర్యో రోంధి ఘేర్యో ఘణో।
సంతనాశబ్ద సుణీ కాం నజాగే॥

న జాగతాం నరసైంయా లాజ ఛే అతిఘణీ॥
జన్మోజన్మ తారీ భ్రాంత భాగే॥"

"ఓమనసా! మమతను విడచి పరమాత్మను భజించు. ఈ ప్రపంచమున నీది ఏది? ఓ మూఢుడా! నీ వెవ్వడవు? ఎచటనుండి వచ్చినావు? వానితో నీకేమి సంబంధము గలదు? తెలియక నాది, నాది యని ఏల వాపోయదవు?"

"ఏ దేహమునకై నీ వనేక యుక్తులచే ప్రయత్నించుచున్నావో అది ఎన్నటికిని స్థిరముగాదు. నీ వహార్నిశములు ఏ ధనార్జన చేయుచున్నావో, యది నీకు బాధాకరమైనది. సమీపముననున్న పరమాత్మను నీ వెందుకు మరచితివి. అహంకారమున నీవు మోహమున బడియున్నావు. కావున ఓ మనసా! నీవు మేల్కొనుము. నరసింహరామునికి నీవు భక్తిగనుండెదవని యాశ కలదు." అని భక్తరాజు వెన్వెంట పైగీతము స్వయముగ రచించి వినిపించెను. మాణెక్ బాయికి చింత తొలగిపోయెను. భగవానునియందు శ్రద్ధ మిక్కుటమగుటచే ఆమె మనసు నిర్మలమాయెను. ఆమె యతిథికి, భర్తకు, ఆసనములువైచి భోజనమొసగెను. నరసింహరాము పురోహితునితోడ భోజనముసేయ నారంభించెను. భోజనమధ్య

మున పురోహితు డిట్లు మాట్లాడదొడగెను. "మెహతాజీ! శ్రీరంగధర మెహతా నన్ను కుమారబాయిని తీసికొనివచ్చుటకు పంపియున్నారు. నేను వారి కులపురోహితుడను. నేను రేపే మీయొద్ద శెలవు గైకొన దలచుచున్నాను. తమరు దయయుంచి వేగిరపడుడు."

"గురుమహారాజా! ఇంతత్వరపడిన కార్యమెట్లు చక్కబడగలదు? ఇంతవరకు పుత్రిక కొక నూతన వస్త్రమైనను సిద్ధముచేయలేదు. తమరు రెండుమూడు దినము లాగవలసి వచ్చును" అని మాణిక్ బాయి జవాబిచ్చెను.

"మీరు ఏవస్తువులు సిద్ధముచేయదలచిరో అయ్యవి నేడే చేయుడు. దయయుంచి నాకు రేపు శెలవొసంగుడు"అని పురోహితుడు ఆగ్రహముగ బల్కెను.

"మహారాజా! మా కేవస్తువు సిద్ధముచేయ బనిలేదు. చేయవలసినదంతయు ఆ భగవానుడే చేయును. కాని మా కుల మర్యాదానుసారముగ ఎప్పటివరకు కట్నముయొక్క ఏర్పాటు భగవంతునిద్వారా జరుగదో అంతవరకు తమరు ఆగవలసివచ్చు"నని భక్తరాజు నవ్వుచు బల్కెను.

భక్తరాజుయొక్క ఈవచనములు పురోహితునకర్థము కాలేదు. ఆత డాశ్చర్యమున "మెహతాజీ! తమరి వచనములు దురూహ్యములు. మీ పరమాత్మ ఇవ్వవలసిన వస్తువుల నెప్పటికి యొసగగలడు? ఇట్టి వచనములు నే నెన్నడు వినియెరుగను. ఈవృథావచనము లేల బల్కుచున్నారో నాకు గోచరమగుట లేదు."

"పురోహితమహారాజా! కంగారుపడకుడు. భగవంతుని మాయ అఘటన ఘటనా పటిమగలది. ఆతని కశక్యమైన దేదియు లేదు. ద్వారకాధీశుడగు శ్రీకృష్ణుడు భక్తవత్సలుడు, దయాళువు" అని సమర్థించుచు నరసింహారాము విశ్వాసమున బల్కెను.

భక్తరాజుని ఈ విచిత్రవాక్యములు పురోహితునకెట్లు అర్థమగును? కాని ఆతడు చేయగలిగినది యెద్ది? తన యజమానుడగు శ్రీరంగధర మెహతాకు దగ్గర బంధువైన నరసింహారామునితో నాతడెట్లు విరుద్ధముగ వ్యవహరించగలడు? మిన్నకుండుటయే ఉచితమని తలచెను.

రెండుమూడు దినములు పురోహితుడట్లే ఉండిపోయెను. కాని వీరలు ప్రయాణసన్నాహములు ఏమియు చేయుటలేదు. ఏచింతయు నెరుగనివానివలె భక్తరాజు తన భజనలలో మునిగియుండెను. తుదకు పురోహితుడు విసుగుజెంది ఇట్లుపల్కెను. "ఇప్పటికి రెండుమూడు దినములు గడచినను తాము నిశ్చింతగ భజనలలో మునిగియున్నారు. ఇక నే నాగలేను. కట్నముయొక్క ఏర్పాటు జరిగినను జరుగకున్నను నేను కుమారబాయిని తీసికొని రేపు తప్పక వెళ్ళవలసియుండును."

మాణిక్ బాయి "పురోహితుడు చెప్పుమాట నిజమే. అమ్మాయికి యివ్వవలసిన వన్నియు యిచ్చి పంపిన పిదప మీరు సుఖముగ కూర్చుండి భజన చేసికొనవచ్చును" అని పల్కెను.

"మంచిది. నీకోర్కె చొప్పున నేడు ప్రభువును పిలచెదను. ఆతనికృప ఎట్లుండునో చూతము" అని నరసింహారాము సహజముగ పల్కెను.

సంధ్యాసమయమున భక్తరాజు కృష్ణమందిరము చేరి కరతాళముల గైకొని భగవద్భజనయందు మది నిల్పెను. మాణిక్ బాయి, శ్యామలదాసులుకూడ అందుచేరిరి. శ్యామలదాసు మృదంగము మ్రోయించుచుండెను. పురోహితుడు వేరొక ఆసనముపై కూర్చుండి ఇట్లు ఆలోచింపదొడంగెను. "ఇదేల వెఱ్ఱితనము? ఇట్లుగంతులిడుచు అరచిన భగవంతుడు వచ్చునా? ఈవిధముగ భగవంతుడు సాక్షాత్కరించినచో ప్రపంచమెల్ల తమ వశమును చేసికొనగలదు. సరి! దీనితో నాకేల? నేనుమాత్రము తప్పక రేపు వెడలెదను. భగవానుడు ప్రత్యక్షమయి కట్నకానుక లిచ్చిననుసరే లేకున్ననుసరియే."

పురోహితు డీ యాలోచనలో మునిగి యుండగనే ఆతని చెవిలో "బోలో భగవాన్ శ్రీకృష్ణచంద్రకీ జై" అను శబ్దము వినపడెను. మీట నొక్కినంతమాత్రమున యంత్రము కదలినట్లు ఆతడు వెంటనే నిలబడి మందిరమువైపునకు జనెను. అచట చూచునదేమన—సాక్షాత్తు శ్రీకృష్ణుడు హారములు, కంకణములు, చీరెలు మొదలగు కానుకలు స్వయముగనిచ్చుచుండెను. లక్ష్మి తనస్వహస్తముల కుమారీబాయికి ఈవస్తువుల ధరింపచేయుచుండెను. భక్తరాజు, మాణిక్ బాయి చేతులు జోడించి నిలబడియుండిరి. శ్యామలదాసు భగవానుని చరణములకు సాష్టాంగ ప్రణామములు సేయుచుండెను. ఈ దృశ్య

మును తుదవరకు పురోహితుడు అత్యాశ్చర్యమున చూచు చుండెను.

నరసింహరాముని సకుటుంబముగ నిశ్చింతతోడ ప్రసన్నులుగ చేసి కుమారబాయిని వస్త్రాభరణముల సంతృప్తుల జేసి భగవంతుడు లక్ష్మీసమేతుడై అంతర్ధానుడాయెను. మరు నాడు కుమారబాయి పురోహితుడు తోడివారలనుండి శెలవు గైకొనిరి. పురోహితుడుకూడ భక్తుల సాంగత్యముతోడి కృతార్థుడయ్యెను.



## పుత్రుని సంబంధము

శ్రీకృష్ణ భగవానుని కృపచే భక్తరాజు కుమారబాయి ఎడబాటుయొక్క పరితాపమునుండి విముక్తుడయ్యెను. ఇపుడాతడు నిశ్చింతగ పూర్వమువలెనే తన జీవితమును భజనలందు గడుపుచుండెను.

అతని భజనలు, పూజలు, సాధుసేవలు నగరమెల్లెడల వ్యాపించెను. కనుకనే ఆతనితోడి వారికి ఆతడన్న అసంతృప్తి కలిగెను. జాతిలోని గొప్పవారాతడన్న ద్వేషింప సాగిరి. ఆతనితో కలసియుండుట తమప్రతిష్ఠకు భంగమని తలచుచుండిరి. కాని నరసింహరాము ఈవిషయములను పట్టించుకొనడు. నిజభక్తులకు ప్రపంచము తమ్ముగూర్చి ఏమి తలచుచున్నదను విషయమును లెక్కింపరు. వారు కేవలము తమప్రియతముడగు భగవంతుడెట్లు సంతోషించునాయన్న

ఆలోచనయందే మునిగియుందురు. ప్రాపంచిక విషయములను వినుటకు వారికి స్వప్నమందైన వీలుండదు. లేనిచో ఇట్లు కూడ చెప్పవచ్చును. భగవంతుడు వినా వేరొకవస్తువుండునని వారికి తోచదు. కాన వారికి వేరొక విషయముపై దృష్టి ఎట్లుండగలదు ?

భక్తరాజుయొక్క పుత్రుడు శ్యామలదాసు పండ్రెండేండ్లవాడాయెను. "పిల్లవాడు వివాహయోగ్యుడైనాడు. మనఇంట తిండికి తికానా లేదు. బీదవానికి తమ పుత్రిక నెవరిత్తురు ? పోనిమ్ము సగోత్రీకులెవరైన సహాయము చేతురాయనిన వారు మనమన్న పెడమొగము పెట్టుచున్నారు. ఈ కారణము చూపియే ఎదురు పుల్లలు వేయుదురు. ఇటిస్థితిలో పుత్రునివివాహము దుర్లభమని తోచును"అని మాణిక్ బాయి ఒకదినమున తన విచారమును భర్తకు వెల్లడించెను.

భర్త "ప్రియా! నీవెందులకు వ్యర్థముగ చింతిల్లెదవు? చింతలను వీడుము. కేవలము శ్రీకృష్ణుని ధ్యానించుము. ఆయననే మనసున సదా తలచుచుండుము. దయాళువగు ఆప్రభువు స్వయముగ మన సమస్త కార్యములను తగు సమయములందు నెరవేర్చుచుండును. మనకొరకై అతడు మనకన్న మిక్కిలి చింతించుచుండును."

సరిగ ఆదినములలోనే గుజరాతులోని బఢ్‌నగరమను గ్రామ నివాసి మదన్ మెహతా తన పుత్రికకు యోగ్యమగు వరునికై అన్వేషించుచుండిరి. మదన్ మెహతా కులీనుడు. ఆయన ఒకరాజ్యములో దివానుగ నుండెను. ఏడెనిమిది లక్షలఆస్థిగలవాడు. రూప, శీలములు గల అతని కుమార్తె

జూతీబాయి వివాహయోగ్యురాలయ్యెను. ఆతడు యోగ్య వరునకై పలుతావుల నన్వేషించెను. కాని ఎచటను ఆతనికి తగిన వరుడు దొరకలేదు. తుదకు తన కుటుంబమువారి నంద రిని చేరబిలచి పిల్లను ఎవరికిత్తుమూ అని ఆలోచింప దొడ గెను. దరిదాపుల తమకు యోగ్యమగు సంబంధము లేదని బంధువులు తెల్పిరి. జునాగఢ్‌లో మన జాతివారి ఇండ్లు ఏడు వందలున్నవి. కాన నచట ఏదియో ఒక సంబంధముండగల దని నుడివిరి.

బంధువుల సలహా ప్రకారము మదన్ మెహతా తన కులపురోహితుని సుందరుడు, సుశీలుడు, కులీనుడు అగు వరుని వెదకుటకై వాహనములు, వస్తువు లొసగి జునాగఢ్‌కు పంపెను. మదన్ మెహతాయొక్క సహపాఠి సారంగధరుడు జునాగఢ్‌లో ఉండుటచే ఆతనికొక ఉత్తరముకూడ ఇచ్చెను. పురోహితుని అందరు ''దీక్షిత్'' అని పిలుతురు.

జునాగఢ్‌లోని ధనిక నాగరజాతివారి వీధిలో ఒక అరుగుమీద సాయంత్రము అందరునుజేరిమాటలాడుచుందురు. ఆదినమునకూడ అట్లే సంభాషించుకొనుచుండ దీక్షితుని రథమువచ్చి అచట ఆగెను. అందరిదృష్టి నాతనిపై బడెను. సారంగధర మెహతా గృహమెక్కడ? అని దీక్షిత్ అడిగెను.

సారంగధరుడు నాగరజాతిలోకెల్ల ప్రతిష్ఠగలవాడు. ఆత డపు డచటనేయుండెను.

"మహాశయా! తమ రెచటనుండి వచ్చుచున్నారు? ఏమిపని? జనులు నన్నే సారంగధరు డందురు'' అని సారంగ ధరుడు పల్కెను.

దీక్షితుడు రథముదిగి యజమానుని ఉత్తరము ఆతని కిచ్చెను. ఉత్తరము ఇట్లు చదువ నారంభించెను.

ప్రియమిత్ర శ్రీ సారంగధరునికి
సప్రేమ వందనములు

మీవద్దకు మా కుల పురోహితుడగు దీక్షితులవారిని పంపుచున్నాను. నా పుత్రిక యగు జూళీబాయి యుక్త వయస్కురాలైనది. దయయుంచి ఆతనికి మీరెరిగినమర్యాద కుటుంబమున రూపశీలములతో కూడిన యోగ్యుడగు వరుని వెదకి సంబంధము నిశ్చయింపవలెను. తమరు నాకు అభిన్న మిత్రులు కావున మీకు ఈశ్రమ నిచ్చుచున్నాను.

ఇట్లు,
మీ మదన్ మెహతా.

సారంగధరుడు ఉత్తరము చదివి దీక్షితుని తనవెంట ఇంటికి గొంపోయెను. దీక్షితుని అతిథిసత్కారములుగావించి, మిత్రుడు మదనరాయుని కుశలముల నడిగెను. బఢ్ నగరము నుండి పురోహితు డొకడు వరాన్వేషణకై వచ్చెనని ఎట్లో నాగరజాతి అంతటను వ్యాపించెను. నల్గడలనుండి ఏదో ఒక మిషపై ఎల్లరు సారంగధరుని ఇంటజేర మొదలిడిరి. వచ్చిన వారందరు తెలియనివారివలె దీక్షితుని జూపుచు "సారంగ ధరా! ఈతడెవరని" ప్రశ్నించుచుండిరి. "ఈతడు నామిత్రుడు మదనరాయుని పురోహితుడు. నామిత్రుని కుమార్తెకు యోగ్యమగు వరుని వెదకుటకై వచ్చియున్నాడు"అని బదులు పల్కుచుండెను. అచటకు చేరినవారు తమ విషయములను

దెల్ప మొదలిడిరి. ఒకడు తనపుత్రుని గుణగానము చేయును. వేరొకడు తన మిత్రుని కులీనతను, ఇంకొకడు తన బంధువుని ఉన్నతిని చెప్ప మొదలిడును. ఒకడు వ్యాపారమున శ్రేష్ఠుని, ఒకడు ఉన్నతోద్యోగిని, ఒకడు సుందరుడు సుశీలుడగు వరుని, మరియొకడు విద్యాసంపన్ను నిజాడలు తెలుపుచుండిరి. దీక్షితు డీ మాటలెల్ల వినుచుండెను.

రెండవనాడు సారంగధరుడు దీక్షితుని వెంటగొని వరు నొకని జూపించుటకు మిత్రుడగు కృష్ణరాయుని ఇంటికి తీసికొని పోయెను. కృష్ణరాయలు దీక్షితుని సత్కరించుచు మాట లందు తన ధనప్రతిష్ఠలను గూర్చికూడ ఉగ్గడించెను. పిమ్మట కుమారుని వస్త్రాదులచే అలంకరించి తీసికొనివచ్చెను. దీక్షి తుడు పిల్లవానిని "నీ పేరేమి?" అని అడిగెను. కాని ఆతడు మాట్లాడలేదు. దీక్షితుడు తిరిగి అడిగెను. పిల్లవాడు కంగారు పడుచు "ఏమిటి మీరు అడుగునది?" అనెను. వరుడు చెవిటి వాడని దీక్షితుడు గ్రహించెను. సారంగధరునితో పోదము రమ్మని సైగచేసెను.

అటనుండి అమిత సుఖరాయుని యింటికి వచ్చిరి. దీక్షి తుని తనవైపు ఆకర్షించుకొనుట కీతడు కూడ అనేక యత్న ములు చేసెను. ద్వారము కడనున్న జనులుకూడ సుఖరా యుని ప్రశంసచేయ నారంభించిరి. అతని పుత్రుడు అలం కృతుడై రాగానే తిరిగి "నీ పే రేమని" దీక్షితుడు అడిగెను. కుర్రవాడు వి...వి...విధ్యా...ధ్యా...ధరరాయ్ అని నత్తి తోడ బల్కెను. దీక్షితు డింకేమియు అడుగక సారంగధరు నికి పోదమని చెప్పెను.

ఈవిధముగ ఎన్నో దినములు తిరుగుచు సారంగధరుడు తన జాతివారగు మిత్రులలో అనేకులను చూపించినను దీక్షితున కొకడైనను నచ్చలేదు. ఒకడు చెవిటి, ఒకడు నత్తి, ఒకడు మూర్ఖుడు, ఒకడు కురూపి అని ఏదో ఒక కారణమున తిరస్కరించుచుండెను. అయోగ్యులను గాంచి విసుగుచెంద నారంభించెను. సారంగధరుడు యోగ్యులను తనకు చూపించక, తన సంబంధీకులను మాత్రమే చూపుచున్నాడని దీక్షితునికి సంశయము కల్గినది. సారంగధరునిపై విశ్వాసము సన్నగిల్లినది. కాని తన యజమానుడు, తన మిత్రుడని తెల్పి, ఆతనికడకు పంపిన సారంగధరుని నేడు కాదనుటెట్లు? సారంగధరునితో ఆత డిట్లు పల్కెను. "మెహతాజీ! వరుడు కేవలము కులీనుడు సుందరుడేగాక గుణవంతుడుగకూడ ఉండవలయును. మీ రెంతోమందిని చూపిరిగాని యోగ్యు డొక్కడును కానరాడు.

సారంగధరునికిని దీక్షితుని ప్రవర్తన విసుగునొంద నారంభించినది. "ఈతడు విలక్షణుడు. ఈతని కెవరు నచ్చుట లేదు. తాను తెలివిగల వాడని తలంచును. వీనికి తెలిసి వచ్చునటుల నేను ఒక సంబంధము చెప్పెదు" నని సారంగధరుడు నవ్వుచు "దీక్షితులుగారూ! తమరు చాలామందిని మావారిలో చూచియున్నారు. ఇపుడు మాలో ఒక ముఖ్యుడైనవాని పిల్లవానిని చూపుచున్నాను. అతడు తమకు తప్పక నచ్చునని తలచెదను. వస్తువు లనేకములు గాంచినమీదట మంచివస్తువు చూచిన దాని మూల్యము తెలియవచ్చును" అనెను.

"సరే! చివరకు చూపించినను, మంచివానిని చూపించుడు. ఇపుడిక హెచ్చుమందిని చూడలేను. పని పూర్తి చేసికొని తిరిగి వెళ్ళవలయును" అనెను.

సారంగధరుడు మనమున నొకమాట యుంచుకొని బయటకు వేళాకోళముగ "చూడండి ఆస్వర్ణకలశముగల ఇల్లు నరసింహారామునిది. ఆతడు కులీనుడు. భగవద్భక్తుడు. ఆతని వడక తీరైనది. డబ్బుకూడ కొదువచేసినాడు. ఆతని పుత్రుడు సర్వవిధముల యోగ్యుడు. అచట తమకు పూర్తిసంతోషము కలుగగలదు. నేనచటికి రావలసిన అవసరముకూడ ఉండదు" అనెను.

"మంచిది. నమస్కారము. నే నిపుడే వెళ్ళెదను. నాకచట అన్నివిధముల తృప్తికల్గిన సంబంధము స్థిరపరచెదను. లేనిచో వేరొక చోటికి పోయెదను. శెలవిండు" అని దీక్షితుడు శెలవుగైకొని వెడలెను.

ఆతడు నరసింహారాముని ఇల్లు చేరెను. ఆదినమున ఏదో వ్రతముండెను. భక్తరాజు హరికీర్తనమందు మున్గియుండెను. ఆతని ఏకాగ్రత తన్మయతల జూచి దీక్షితుడు ఆశ్చర్యచకితుడాయెను. మనమున ఇట్లాలోచింప దొడంగెను. "భగవల్లీలలు చిత్రములు. ఈ జునాగఢ్ మొత్తమందు ఇచటనే నాకు శాంతికల్గినది. ఎంత పవిత్రముగ ఈ ఇల్లు గలదో అంతే పవిత్రతగల వరుడు లభించిన మదన్ మెహతా పుత్రికభాగ్యము పండును".

దీక్షితునికి యథోచితసత్కారములు చేసిరి. మాధ్యాహ్నిక హరికీర్తనము సమాప్తమయ్యెను దీక్షితుడు భక్త

రాజునకు నమస్కరించెను. భక్తరాజాతనికి భగవంతునిప్రసాద మిచ్చుచు "తమ శుభనివాస మెచ్చట" యని అడిగెను.

"భక్తరాజ్! నేను జునాగరపు దివాను అగు మదన రాయుని పుత్రికకు సంబంధమునకై కొద్ది దినములక్రితము ఇచ్చటకు వచ్చియున్నాను. అదృష్టవశాత్తు నేడు మిమ్ములను చూచు భాగ్యము కల్గినది. తమకుగూడ యుక్తవయస్సుగల పుత్రుడు గలడని వింటిని. దయచేసి చూపించగలరా?" అని యడిగెను.

"అయ్యా! ఈ గ్రామమందు ఏడువందల నాగర గృహములు గలవు. వారెల్లరు ధనాఢ్యులు, కులీనులు.

యస్యాస్తి విత్తం స నరః కులీనః
స పండితః స శ్రుతిమాన్ గుణజ్ఞః,
స యేవవక్తా స చ దర్శనీయః
సర్వేగుణాః కాంచన మాశ్రయంతి॥

ఎవనివద్ద ధనము గలదో ఆతడే కులీనుడు, పండితుడు, వేదవేత్త, గుణవంతుడు, వక్త, దర్శనీయుడు, అన్నిగుణములు కాంచనము ననుసరించియుండును అను విషయము తమకు తెలిసియే యుండును. ఈనీతి ప్రకారము నేను కులీనుడను గాని, గుణవంతుడనుగాని, పండితుడనుగాని కాను. కేవలము రాధేశ్యాముని నామము మాత్రమెరిగిన వాడను." అని తన పరిస్థితిని నరసింహారాము స్పష్టముగ తెల్పెను.

"భక్తశిరోమణీ! లక్ష్మి చంచలము. వచ్చును పోవును. నేటి అమీరు రేపటి పకీరు. కనుకనే మహాత్ములు ధనము గలవానిని నిజమగు సంపదగలవానిగ తలపరు."

కబిరా సబజగ్ నిర్ధనా। ధనవంతా నహి కోయి
ధనవంతా సొయి జానియో। రామధనీ జో హోయి॥

ఈ ప్రపంచమున ధనికులెవ్వరు లేరు. ఎల్లరు నిర్ధనులే, రామధనము కలవాడే ధనవంతుడు అని కబీరుదాసు పల్కి యున్నాడు. స్వామీ! కేవలము తమవద్దనే ఆ రామధనమున్నట్లు నేను స్వయముగ చూచియున్నాను. కాన వన్నిక భ్రమసేయక తమ పుత్రుని నాకు చూపింపు''డని దీక్షితుడు నిజ ధనమునుగూర్చి వ్యాఖ్యానించుచు బల్కెను.

నరసింహ మెహతా శ్యామలదాసును బిలచెను. భగవత్కృపచే దీక్షితునకు శ్యామలదాసుని ముఖము చంద్రబింబమువలె కన్పట్టెను. ఆతని అలౌకిక తేజోమూర్తిని జూచి సంతోషించెను. సాముద్రిక శాస్త్రప్రకారము శ్యామలదాసునందు శుభలక్షణము లనేకము గాంచెను. వెన్వెంట శ్యామలదాసు చేతియందు నారికేళము స్వర్ణముద్ర నుంచి లలాటమున తిలకముంచి సంతోషమున నిట్లు బల్కెను. ''భక్తరాజ! మదనరాయని పుత్రికయగు జూఠీబాయితోడ శ్యామలదాసుని సంబంధము స్థిరపరచుచున్నాను'' అనెను.

''భగవదేచ్ఛ ఎట్లున్నదో అట్లేజరుగు''నని భక్తరాజు తన నిర్లిప్తత ప్రకటించెను. ఇంతలో మాణిక్ బాయి అచటకు వచ్చెను. పుత్రుని వివాహనిశ్చయ మైనదని వినిన తల్లి హృదయ మెంత సంతోషించునో ఎవరు తెల్పగలరు? ఈ నిర్ధన సమయమందు కూడ ఇట్టి శుభవార్త విని ఆమె ఆనందాశ్రువులు రాల్చెను.

మరునాడు దీక్షితుడు బఢ్‌నగరుకు పోయెను. తన యజమానునితో నరసింహరాముని అపూర్వభక్తి, సజ్జనత్వము వర్ణించి చెప్పెను. శ్యామలదాసు రూప శీల లక్షణములను వర్ణించుచు జూఠీబాయి సౌభాగ్యమును గొనియాడెను. మదనరాయుని కుటుంబ మీ విషయముల విని చాల సంతసించిరి. నరసింహరాముని లేమినిగూర్చి 'కులశీలములు మంచివి యైనచో ధనమునుగూర్చి విచారింప బనిలేదు. భగవంతుడు మనకు నిండుగ ఇచ్చియున్నాడు. మనకుగల ఏడెనిమిదిలక్షల ఆస్థియందు వారికి ఒకటి లేక అర ఇచ్చినచో వారికష్టములు తొలగగల'వని మదనరాయుడుత్సాహమున బల్కెను.



## శ్యామలదాసుని వివాహము

జునాగఢ్ నగరమందు — బఢ్‌నగరవాసి మదనరాయుని కుమార్తెతోడి నరసింహరామునిపుత్రునకు వివాహము నిశ్చయమైనదన్న వార్త వ్యాపించెను. ఈ విషయము నరసింహరాముడనిన గిట్టనివారికి ఎంతో బాధాకరమైనది. దుష్టులు తమ ముక్కుల కోయించుకొనినను ఇతరుల మంచిని చెరుపవలెనని యత్నింతురు. జునాగఢ్‌లోని కొందరు బ్రాహ్మణులు నరసింహరాముని పుత్రుని వివాహమునకు విఘ్నములు సేయ సంకల్పించిరి. వారికి నాయకుడు సారంగధరమెహతా. మదన్ మెహతాకు బ్రాహ్మణునిచే ఒక లేఖను బంపిరి.

దీక్షిత్ బఢ్‌నగకు వచ్చినది మొదలు మదనమెహతా వివాహయత్నములు సేయ నారంభించెను. గృహాలంకరణ

ములు ప్రారంభించిరి. వియ్యాలవారికి విడుదు లమర్చబడు చుండెను. భోజనవసతులు, బాజాభజంత్రీల ఏర్పాట్లుచేయు చుండిరి. రాజ్యమున గల శ్రీమంతులకు బంధువులకు శుభ లేఖలు పంపుచుండిరి. ఏకైకపుత్రిక వివాహము కడువైభవో పేతముగ చేయుటకు అట్టహాసములు చేయుచుండిరి. అట్టి సమయమున జూనాగఢ్ బ్రాహ్మణుడు వెళ్ళి మదనమెహతాకు లేఖ నొసగెను. అందిట్లున్నది.

శ్రీయుత మదనరాయునికి,

తమ ఏకైక కుమార్తెకు సంబంధము నిశ్చయించుటకు తమ పురోహితుడగు దీక్షితు వచ్చియున్నాడు. జునాగఢ్ నందు మనజాతికి చెందినవి ఏడువందలిండ్లున్నవని తమకు తెలి యును. కాని ఆతడు ఏ యోగ్యమైన గృహమందు సంబం ధము చూడక దరిద్రుడు, జాతిచ్యుతుడగు నరసింహరాముని సంబంధము నిశ్చయించి యున్నాడు. ఆ సంబంధము తమకు తగినది కాదని వినయముతోడ తెలియజేయుచున్నాము. భిక్ష మెత్తికొనుచు, బైరాగులతోడి తిరుగువాడు బఢ్నగర దివా నునితోడ వియ్యమెట్లొందగలడు? కావున తమరాసంబంధము వదలి మీ మర్యాదకు భంగముకానిచోట వేరొకచో తగిన సంబంధము చూసి చేసికొనుడు. అధికముగ మీకు తెలియ జేయవలసినదేమున్నది?

ఇట్లు,

మీ సారంగధరుడు.

జునాగడ్ జాతి మండలి తరఫున.

లేఖ చదివిన పిమ్మట మదనమెహతా చింతామగ్నుడయ్యెను. సంబంధము స్థిరపడినది. ముహూర్తముకూడ నిశ్చయమైనది. వివాహపు ఏర్పాట్లు జరిగినవి. ఆహ్వాన పత్రికలు పంపబడినవి. ఇపుడు ప్రతిష్ఠకై ప్రాకులాడిననేమి ప్రయోజనము''ని ఆలోచించెను. తటాలున ఒక ఆలోచన తట్టెను. ''ఒక లేఖ వ్రాసెదనుగాక. దానికి అనుకూలమై నరసింహారాముడు వచ్చినచో ఎట్టి ఆటంకము లేక వివాహము చేసెదను. అట్టి ఏర్పాట్లు చేయలేకున్నచో ఆతడు రానేరడు. కాన నాకు రెండువిధముల ప్రతిష్ఠ సురక్షితము కాగలదు.'' వెంటనే ఉత్తర మొకటివ్రాసి బ్రాహ్మణుని చేతికిచ్చిపంపెను. అందిట్లుండెను.

''సిద్ధశ్రీ అనేక శుభోపయోగ్యులగు శ్రీయుత నరసింహారాం మెహతాగారికి, బఢ్‌నగరునుండి మదనమెహతా అనేక నమస్కారములు.

తమ సుపుత్రుడగు శ్రీ శ్యామలదాసునకు నాకుమార్తెయగు జూఠీబాయిని యిచ్చి వివాహము చేయుటకు మాఘ శుక్ల పంచమినాడునిశ్చయమైనది. కావున తమరుపైలగ్నము నాటికి ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, చతురంగబలములతో తమరు విచ్చేయవలయును. మరియు నా ప్రతిష్ఠకు తగినరీతి వస్త్రాభరణములు తోడ్తేవలయును. నాకు తగినరీతిని వస్త్రాలంకరణములు తీసుకొని రానిచో నా పుత్రిక వివాహమునకై ఇతరత్ర విచారింపవలసివచ్చును.

తమ,

మదనరాయ''

బఢ్‌నగరునుండి బ్రాహ్మణుడువచ్చి నరసింహారాము నకు లేఖ ఒసంగెను. ఉత్తరము చదివి భక్తరాజు కరతాళము లను తీసికొని భజనమందిరమునకు బోయెను. భక్తుని పిలుపు విని భగవానుడు ప్రత్యక్షమాయెను. ''వత్సా! నన్ను బిల చుటకు కారణంబేమి'' అని అమృతవాక్యముల నడిగెను.

భక్తరాజు గద్గదుడై ప్రభు పాదములపై పొరలిడెను. లేచి ప్రభున కా ఉత్తర మొసంగెను. ఉత్తరము చదివి భగ వానుడు ''వత్సా! నీకు చింతవలదు. ఇదంతయు జూనాగఢ్ బ్రాహ్మణుల పనియని నే నెరుగుదును. స్వయముగ నాపరి వారముతోడి నాగర వేషము ధరించి వివాహామునకు వచ్చి నీ కార్యము నెరవేర్చెద''నని పల్కి భగవానుడు అంతర్ధాను డయ్యెను. ఆతని భక్తవాత్సల్యమునకు ధన్యవాదములు.

నరసింహారాము బఢ్‌నగరునుండి వచ్చిన బ్రాహ్మణు నికి ఉచిత సత్కారముల గావించి పంపెను. నిశ్చింతగ తాను భజన సల్పుచుండెను. మాఘ శుక్ల పాడ్యమినాడు నుదుట సిందూరమలదికొని చేత కరతాళముల గ్రహించి, ఐదారుగురు సాధువులతోడి పుత్రుని వివాహామునకై బయలుదేరెను. ఈ విచిత్రమగు పెండ్లివారిని జూచి మాణిక్‌బాయి భర్తతో "స్వామీ! ఈసామాగ్రితోడనేనా తమరొక దివానుగారి ఇంటికి పోవుట? పుత్రుని వివాహామునకు బదులు అవమానము తోడ ఇంటికి తిరిగి రావలసి వచ్చునేమో?'' అని అడిగెను. మెహతా మృదువుగ "ప్రియా నీ వధైర్యపడుచున్నావు. ఈతడు మన పుత్రుడేకాడని తలచినపుడు మనకు అవమాన

మేమిటి? దీనికై చింతఏల? ఈత డెవనిపుత్రుడో ఆతడే తన వానిని అవమానమునుండి కాపాడగలడు." జూనాగఢ్ నగర బ్రాహ్మణుల కీ విచిత్రమగు పెండ్లివారినిచూచి కల్గిన ఆనంద మునకు మేర లేదు. తమపని ఇక నెరవేరునని తలచిరి. నర సింహారాముసకు దీక్షితునకి తదితర స్నేహితులకు గర్వము తొలగునని తలచిరి. "ఈ బికారికి ఎంతధైర్యము? కొలది బికారులను ప్రోగుచేసికొని దివానుగారి బాలికను వివాహ మాడుటకు పయనమగుచున్నా ! దీనితో ఈతని గర్వమణగి పోగలదు. బఢ్ నగరులోని ప్రజలీతని లంగోటీ, కరతాళములు లాగికొని ఈతనిని దేహశుద్ధిచేయుదురు. అప్పు డీతడు తన పదములను మరచిపోవును. మనము సుఖముగ నిదురింప వచ్చును'' అని తలంచిరి.

కాని భక్తరాజున కేమిచింత? తన భజన తాను చేసి కొనుచుండెను. కొద్దిదూరము చనినపిదప చాలామంది పెండ్లి వారు డేరాలు వేసికొనియుండుట చూచెను. సమీపమునకు పోయి స్వయముగా గృహస్థరూపముననున్న భగవానుని చూచి భక్తిపూర్వకముగ భక్తరాజు ఇట్లనెను. ''భగవన్! తమరు నాకై ఇట్టి బృహద్రూపము ధరించి, నాకార్యము నెరవేర్తురని నేను ఊహింపనైతిని.''

''వత్స! ఇందాశ్చర్యమేమి? నేను సదా భక్తులకధీను డను. ఏభావమున భక్తులు నన్ను స్మరింతురో తదనురూప ముగ నే నవతరించెదను. గోపికల కామానుసారముగ అనేక రూపములధరించి వారి ఇచ్ఛ నెరవేర్చలేదా? బాలభక్తుడగు ప్రహ్లాదుని విషపానము చేయించుతరి నేను విషస్వరూపుడనై

ఆతనిని రక్షించలేదా? పుత్రా! నా భక్తునికై ఎట్టిపని చేయు టయు నాకు కష్టముకాదు'' అని భగవానుడు పల్కెను.

అచటనుండి పెండ్లివారు గజ రథ తురగములతో బయలుదేరిరి. అనేక వాద్యములు మ్రోగుచుండెను. ఎన్నో బండ్లపై డేరాలు అలంకరణ సామగ్రి నింపబడియుండెను. స్వయముగ ద్వారకాధీశుడే బయలుదేరినచో కొదువెట్లుం డును? నిశ్చితసమయమునకు పెండ్లివారు బఢ్‌నగరముచేరిరి. పెండ్లివారి అట్టహాసముచూచి చక్రవర్తి తన పుత్రుని వివా హము చేయుటకు వచ్చుచుండెనాయని తలంచుచుండిరి.

మదన మెహతాకూడ తన అభీష్టము చొప్పున వివాహమునకు అన్ని ఏర్పాట్లు చేసెను. దూరదూరమునుండి బంధువులు వివాహమునకై వచ్చిరి. పెండ్లివారి రాక విని స్వాగతమిచ్చుటకు అందరితోడ ఎదురేగెను. శ్రీమన్నా రాయణ శోభగల ఆపెండ్లివారిని చూచి ఆతడు స్తంభించి పోయెను. అపు డాలోచించెను ''ఇట్టి పెండ్లిసంబంధమును ఒకరాజైనను తీసుకుని రాలేడు. నాతో వియ్యమొందుటకు వచ్చువాడు సామాన్యుడు కాడు. నేనీతనికి అహంకార పూర్ణమగు ఉత్తరము వ్రాసి పొరపాటు చేసితిని. ఈపెండ్లి వారికి భోజనాది సత్కారములు చేయుట అట్లుండ కనీసము మంచినీరైనను సరిగ అందచేయలే''నని తలంచుచు శీఘ్రముగ నరసింహమెహతాకడకు పోయెను. శ్రీకృష్ణుని డేరావద్దకు వచ్చి ఇదియే వియ్యంకుడుడేరా అయిఉండవచ్చునని తలచెను. మదనరాయుడు కలసికొనుటకు వచ్చెనని పహరావానిద్వారా కబురు పంపెను. ఆజ్ఞపొంది పహరావా డాతనిని లోనికి

గొంపోయెను. ఆతడు భగవానునికి నమస్కరించుచు "నర సింహారాముగారు! నమస్కారము" అనెను.

భగవానుడు వినోదముగ "మదనరాయా! నేను వారి కొక నీచమైన సేవకుడను. రండు నేను వారివద్దకు మిమ్ముల గొంపోయెద"నని పల్కెను.

భగవాను డాతనిని వెంటనిడుకొని నరసింహారాముని వద్దకు గొంపోయెను. భక్తరాజు కొద్దిసాధువులతో హరికీర్త నము సేయుచుండెను. ఆతడు భజనలో లీనుడగుటచే బాహ్య దృష్టియే లేకుండెను. ఇంతటి ఐశ్వర్యసంపన్నుడై యుండియు ఈ నిరాడంబరతచూచి మదనమెహతా అభిమానము చూర్ణ మయ్యెను. ఇట్టి సత్పురుషుని వియ్యమొందబోవుట తన అదృష్టమని మనమున తలచెను.

భగవానుడు భక్తరాజుని ధ్యానభంగముచేసి మదన రాయని పరిచయము చేసెను. వియ్యంకు లిరువురు ప్రేమ పూర్వకముగ ఆలింగనముగావించుకొనిరి. కుశలప్రశ్నలడిగిన పిదప మదనమెహతా తన అహంకృతికి క్షమాపణగ "భక్త రాజ! తమతోడి వియ్యమొందుటకు నేను ధన్యుడ" నని పల్కెను. "మెహతాగారూ! ఇదంతయు భగవానుని కృప" యని భక్తరాజు పల్కెను.

మదనమెహతా, భగవానుని నరసింహారాముని యథా శక్తితో సత్కరించి విధిపూర్వకముగ వరపూజగావించి కన్యా దానముచేసెను. వివాహము సక్రమముగ నెరవేరెను. మదన మెహతా అమూల్యమగు వస్త్రాభరణములను కట్నముగ నొసగి పుత్రికను అత్తవారింటికి పంపెను.

ఈవిధముగ శరణాగతవత్సలుడగు భగవానుడు భక్త పుత్రుడగు శ్యామలదాసుని వివాహాముగావించి సకుటుంబముగ అంతర్థాన మొందెను.



## పుత్రుని మృత్యువు

నేటి ధనవంతుడు రేపటి దరిద్రుడు. నేటి ఆరోగ్యవంతుడు రేపటి రోగి. కనుకనే మన ప్రాచీన గురుజను లీ ప్రపంచమును మేఘపునీడతో పోల్చియున్నారు. క్షణమైనను ఒక స్థితిలో నుండక సదా మారుచుండును. ప్రపంచమునకే ఇట్టిస్థితియుండగ ప్రపంచములోని జీవులుమాత్రముస్థిరములా?

భక్తరాజు నరసింహరాముని పై నకూడ ఈ ప్రాపంచక చక్రము తిరిగినది. ఒకదినము ఏ శ్యామలదాసుని వివాహము ఎంత వైభవముగ చేసిరో ఆ శ్యామలదాసు వివాహమైన కొద్ది కాలముననే ఈలోకమును అకస్మాత్తుగ విడిపోయెను.

సంసారసాగర తరంగములలో నోలలాడుచున్నను భగవానుని నిజభక్తులు ఈసంసారతాపత్రయములకుమారులు. సంసారిక దుఃఖములు భగవత్కృపయని తలచి ఆనందమున వానిని వర్ణించెదరు. ఏలనన వారు దుఃఖములు భగవత్ప్రేమను వృద్ధినొందించునని తలంతురు. ఇకారణముననే కుంతి శ్రీకృష్ణుని దేవా! నీకు నాయందనుగ్రహము కల్గిన ఎల్లప్పుడు నాకు దుఃఖముల నొసగు''మని అడిగెను. కాన నరసింహ రామునికిమాత్రము దుఃఖమెట్లు కల్గును? ఆతడు మొదటనే

భగవానుని తనవానినిగ చేసికొనెను. శ్రీకృష్ణభగవానుని నిరంతర భజనలో ఆతని హృదయము భగవన్మయమయ్యెను. భగవద్భక్తి యనెడు నౌకద్వారా దుస్తర శోకసాగరమును దాటెను. ఏకైక పుత్రుని మృత్యువు, నవవివాహితయగు కోడలి వైధవ్యములచే ఆతని హృదయము లేశమాత్రమైనను వ్యథనొందలేదు. కాని పుత్రశోకాకులయగు మాణిక్‌బాయిని ఓదార్చుటకు ఈ గీతమును పాడెను.

భలుం థయుం భాంగీ జంజాల్ సుఖే భజేశుం శ్రీ గోపాల్

(భలా హువా ఘూటా జంఝాల్ ససుఖ భజేంగే శ్రీ గోపాల్)

(బంధనములు తొలగినవి, ఇక శ్రీగోపాలుని భజింతమురమ్మ)

భర్త ఉపదేశమువలన మాణిక్‌బాయి శోకము తొలగెను. ఇరువురు శ్రీకృష్ణుని కృపచే ఈఘటనను మరచి ఆనంద పూర్వకముగ భగవద్భజన సాధుసేవల బూర్వమువలె జీవితముల గడుపుచుండిరి.



## పితృ శ్రాద్ధము

పుత్రవియోగమైన ఆరుమాసములకు పితృపక్షమారంభమాయెను. గుజరాతులోని కథియవాడ్ ప్రాంతమందు తరచు ఎల్లరును పితృదేవతలకొరకై శ్రాద్ధమును విధిపూర్వకముగ చేసి పిండదానము చేయుదురు. ఆనాడు బ్రాహ్మణులకు భోజనము పెట్టుదురు. నరసింహమెహతా పితృశ్రాద్ధ తిథి సప్తమి. వంశీధరుడా దినమున శ్రాద్ధమును పెట్టుటకు నిశ్చయించి ఒకదినము పూర్వమే తనజాతి సోదరులను భోజనము

నకు బిలచెను. కులమర్యాదచొప్పున నరసింహమెహతా ఇంటికి పిలచుటకు వచ్చి "నరసింహా! రేపు తండ్రిగారి శ్రాద్ధ తిథి కనుక నిన్ను సకుటుంబముగ భోజనమునకు పిలచుటకు వచ్చితిని. అచట చేయవలసినవి చాల ఉండును గనుక మాణిక్‌బాయిని నేడే పంపుము. నీవుకూడ రేపు ప్రాతఃకాలముననే రమ్ము. రేపు ఒక్కదినముమాత్రము ఆసన్యాసుల గుంపులోనికి పోకుము" అనెను.

నరసింహారాము శాంతముగ "అన్నా! సాధువులన్న నాకు ప్రాణముకన్న హెచ్చుప్రీతి కాన సాధుసేవ చేసినపిదప మాత్రమే రాగలను. నాభార్యయు భగవంతునికి నైవేద్యము చేసినపిమ్మట రేపు రాగలదు."

"ఓరీ! భిక్షమెత్తుకొని సాధుసేవచేయువానికింత అహంకారమా? నీకింత నిర్లక్ష్యమైనచో తండ్రిగారి శ్రాద్ధము నీవే పెట్టుకొనుము. దగ్గర దమ్మిడీ లేకున్నను నీ కదరిపాటు ఎక్కువ. ఇదేకదా నీస్థితి" అని వంశీధరుడు చిటచిటలాడుచు పల్కెను.

"అన్నా! నీ ఆజ్ఞ చొప్పున పితృ శ్రాద్ధము ఇద్దరు ముగ్గురు బ్రాహ్మణులకు భోజనము పెట్టి నేనే చేసెదను. శ్రాద్ధమందు బంధువులకు సోదరులకు బెట్టుట లౌకికవ్యవహారము. కాని మనము 'శ్రద్ధయా దీయతే అనేనేతి శ్రాద్ధం' శ్రద్ధగ పెట్టునదే శ్రాద్ధ మను శాస్త్రవాక్యమును మరచి కేవలము బంధువులకు భోజనములు పెట్టుటయందే తమ పితృదేవతలను ఉద్ధరించుటయని తలంచుచున్నారు. ఇది సరికాదు" అని నరసింహారాము పల్కెను.

ఇది విని వంశీధరుడు మండిపడెను. క్రోధముస నేత్రములు ఎఱ్ఱబారి ఇంటికిపోయి జరిగినదెల్ల దురితగారికి చెప్పెను. దురితగారి కోపము చెప్పనక్కరలేదు. మరదిపైగల కోపము భర్తమీద తీర్చుకొనెను. "అసలు మీరు వాని ఇంటికేల పోయితిరి? నాకు మొదటినుండి ఆ భక్తుడు, భక్తురాలి విషయము పూర్తిగ తెలియును. వారు తద్దినమునకు మన ఇంటికి రాకున్న మనకు వచ్చు నష్టమేమి?"

ఇచట భక్తరాజు తద్దినము పెట్టుటకు నిశ్చయించెను గాని ఇంట నొక శేరు బియ్యమైనను లేవు. అయినను భక్తరాజు నిశ్చింతగ నుండెను. ప్రభువు ఎదుట కూర్చుని భజన సేయుచుండెను. మాణిక్ బాయి ఆతని నిశ్చింతచూచి ఇట్లు పల్కెను. "స్వామీ! రేపు మీరు తండ్రిగారి తద్దినము పెట్టుటకు నిశ్చయించినారు. ఇంట శేరు బియ్యమైనను లేవు. కాన మొదట ఆ ప్రయత్నము చేయుడు."

"ప్రియా! మొదట నన్ను ప్రభుగానము సేయనిమ్ము. పిమ్మట అంగడికిపోయి అప్పునకైనను సామాగ్రి తీసుకొని వచ్చెదను. అప్పు దొరకనిచో ఆ విషయము భగవంతునికీ, పితృదేవతలకే ఎరుక" అని భక్తరాజు బదులు చెప్పెను.

మాణిక్ బాయి "స్వామీ! మనము పరమాత్మను నమ్మినాము. కాని ఆతనికి న్యాయమెక్కడ? చూడండి. మీ అన్నగారికి అంతటి సంపద కలదు. మనకో నిత్యము పొట్ట గడచుటకే దుర్లభ మగుచున్నది" అని కన్నీరు కార్చెను.

"సాధ్వీ! నీవు మాటి మాటికి ఈఅసహ్యామగు అశ్రద్ధ వచనము లేల పల్కుచుదువు? నేను నాప్రభువుపై నిందారోపణ చేసితివి. భగవంతుడు న్యాయమూర్తి, దయాళువు. నీవు నా అర్ధాంగివయ్యు నీయందు శ్రద్ధలేకుండుట నాదురదృష్టము. పాప పుణ్యములను భగవంతుడు న్యాయముగ నిర్ణయించును. ఏది అచ్ఛమగు బంగారమో దానికే ఘాతములు, నిప్పున కాల్చుట, గీటురాయిపై గీయబడుట సంభవించును. స్వర్ణ కారుడుకూడ ఇతర లోహములను గాక స్వచ్ఛమగు బంగార మునే పరీక్షించును. మనకిది పరీక్షాసమయము. ఆ పరమ పిత సభయందు మరపుననైనను అన్యాయము జరుగదని నా నమ్మకము" అని నరసింహరాం భార్యను సమాధాన పరచెను.

"నాధా! క్షమింపుడు. నా నేత్రములు తెరువబడినవి. నేనిక ఇంతకంటె కష్టములు కల్గినను చలించను. కృపాళుడగు ఆజగన్నాధుని పూర్తిగ నమ్మెదను. నా కర్ణభూషణములను అమ్మి అవసరమగు సామాగ్రి తెచ్చి రేపటి పని నెరవేర్పుడు" అని మాణిక్ బాయి తన ఆభరణములను పతికి ఇచ్చెను. భర్తకు ఆపదలయందు ధైర్యము పల్కుచు, దుఃఖమందు భాగమును తీసుకొనునదియే నిజమగు అర్ధాంగి.

"ధీరజ ధర్మ మిత్ర అరునారీ । ఆపత్కాల పరఖియే చారీ"

ధైర్యము, ధర్మము, మిత్రుడు, నారి – ఈ నాల్గింటిని ఆప త్కాలమందు పరీక్షింపవలయును, అని తులసీదాసు ప్రవ చించినాడు.

ధనము పోయిన సమయముననే స్త్రీకి పరీక్ష కల్గును. మాణిక్ బాయి ఆభరణము గైకొని నరసింహారాం అంగడికి పోయి దానిని అమ్మి అవసరమగు వస్తువులు కొనితెచ్చెను. నేయి తప్ప ఇతర సామానులన్నియు తీసికొని ఆత డింటికి వచ్చెను. మాణిక్ బాయి ఆవస్తువులను జూచి "స్వామీ! ఇయ్యవి ఐదారుగురు మనుష్యులకు సరిపోవును. కనుక ముగ్గురు నల్గురు బ్రాహ్మణులను, పురోహితుని భోజనమునకు పిలువుము" అని పల్కెను.

మెహతా నాగరుల వీధికి వచ్చెను. అచట తమజాతి ధనికు లెందరో కూర్చుండియుండిరి. భక్తరాజుని చూచి ప్రసన్నరాయు డను నాగరుడు నవ్వుచు వేళాకోళమున "స్వామీ! తమ శుభాగమన మెచటకు" "మిత్రమా! రేపు మా తండ్రి తద్దినము. ఇద్దరు ముగ్గురు బ్రాహ్మణులను, పురోహితుని భోజనమునకు పిలచుటకు వచ్చితి"నని నరసింహారాము సరళముగ బల్కెను.

"ఇద్దరు ముగ్గురు మాత్రమేనా? మిగిలినవారు ఏమయి పోగలరు? అందరును మీతండ్రిగారి తద్దినమునకువచ్చి భగవత్ప్రసాదమును పొందకూడదా?" అని నాగరజాతి పురోహితుడు వేళాకోళముగ బల్కెను.

"మహరాజ్! భగవత్ప్రసాదమున కందరును అధికారులే. రేపు మా అన్నగారు మాతండ్రిగారి పితృకార్య సందర్భమున మిమ్ములనందరిని పిలుచును. దరిద్రుడనగు మా ఇంటికి ఎవరువచ్చెద''రని నరశింహారాం అభిమానమువదలి పల్కెను.

''నరసింహారాంజీ! వంశీధరుడు మమ్ములను పిలచునని మీరు విచారపడనక్కర లేదు. మేము మీ ఇంటికివచ్చి భగవంతుని నైవేద్యము గ్రహించి పునీతులమయ్యెదము. తమ కోరికయు నెరవేరు''నని ప్రసన్నరాయుడు హేళనగపల్కెను.

ఒరుల నపకీర్తిపాలు చేయుటకు దుర్జనులు ఎంతయు నమ్రత నటింతురు. ప్రసన్నరాయుని ఈవాక్యములు విని అచట గలవారందరు తమలోతాము సైగలచే ప్రోత్సహించుకొనిరి. జాతివారినందరిని నరసింహారాం నేడుపిలచిన ఎంతయు బాగుండునని తలచిరి. ఇంతమందికి అతడెట్లు భోజనమేర్పాటు చేయగలడో చూడదలంచిరి.

కాని శుద్ధహృదయునకు ఎల్లడ శుద్ధత్వమే కానవచ్చును. జాతివారందరు భగవత్ప్రసాదము కోరుచుండ వారలను నిరాకరించుట తగదని నరసింహారాము తలచెను. ఒక పర్యాయము గంగవంటి తన జాతి రాకడచే తన గృహము పావనమగునని తలంచెను. ఈ భావన స్ఫురించగనే అతడు భగవంతుని స్మరించి ''జాతివారి నందరిని ఆహ్వానించెదను. పిమ్మట భగవదేచ్ఛ ఎట్లున్న అట్లే జరుగగల''దని తలచెను. అతని పురోహితునితో ''స్వామీ! మన పదువందల గృహములలోని జాతివారి నందరిని పిలచిరండు. రేపు సాయంకాలము శ్రీ ద్వారకాధీశుని జయధ్యానముల చేయుచు జాతిమాత నాకుటీరమును పావనము చేయగలదు ఇదికూడ ఒక ఆనందమే'' అని పల్కెను.

చిత్తమని పురోహితుడు పల్కి జాతివారి నందరిని పిలచివచ్చెను.

ఈవిషయము నాగరజాతి వారికందరకు వ్యాపించెను. ఎవని మనస్సెట్టిదో అట్లే ఊహించును. అట్లే పల్కుచుండును. "నేడందరు కలసి భక్తునిపని పట్టినారు. ఎన్నడును ఆతని ఇల్లు చూచు అవకాశము లభింపలేదు." అని ఒకడు పల్కెను. మరియొకడు "ఇది బూటకపు పిలుపు మాత్రమే. గోపీచందనము, కరతాళములు తప్ప ఆతనివద్ద మరేమికలదు? ఆ బైరాగి జాతివారికందరకు భోజనమెట్లుపెట్టగలడు? భోజనసమయమునకు పిలుపు వచ్చిన అపుడు చూతము." అనెను. "ఎట్లైనకానిండు మనకిపుడు అన్నముదొరకక చచ్చుటలేదు గదా! ఆతడు నిజభక్తుడో లేక ప్రజల మోసగించు వేషకాడో నిశ్చయము కాగలదు. నిజభక్తుడైన అందరిని భోజనముచే సంతుష్టి పరచి తన మాట చెల్లించుకొనగలడు. లేనిచో తన మొహముకూడ చూపలేడు." అని వేరొకడు పల్కెను. "ఆతడు ఏ యమాయకునినో తనవలలో వేసికొని యుండును. లేకున్న ఇంత ఉదారత ఆతని కెక్కడిది?" అని వివిధరీతుల ఎల్లరు పల్కిరి.

రెండవదినమున ప్రాతఃకాలము కాగానే భజనాదుల గావించి నరసింహరాం నేతిపాత్ర తీసికొని అంగడికిపోయెను. "జాతివారి కందరకు సరిపోవు నేయి ఈ చిన్నపాత్రలో ఎట్లు పట్టగల"దని వీతరాగుడగు అమ్మహాత్ముని కేమితెలియును? భజనయందు మగ్నుడై ఇంటనుండి బయలుదేరెను.

ఆతనిని చూచి ఒక వ్యాపారి "మెహతాజీ! ఏ వస్తువు కొనుటకు ఎచ్చటకు బయలుదేరినారు? సాధుసంఘమేదైన రాలేదుకద?" అని ప్రశ్నించెను.

''లేదు, స్వామీ! సాధుమండలి రాలేదు. నేడు పితృశ్రాద్ధమున బ్రాహ్మణభోజనమునకై పదిమణుగుల నేయి కావలసివచ్చినది. మంచినేయి ఉన్న చూపించుడు'' అని భక్తరాజు పల్కెను.

"నేతిడబ్బు తెచ్చినారా! లేక తర్వాత చెల్లింపదలచు చున్నారా?'' అని వ్యాపారి అడిగెను.

''సోదరా! నేతిడబ్బు ఇపుడు తీసికొని రాలేదు. ఒక నెలలో తప్పక తీర్చెదను'' అని నరసింహరాము జవాబిచ్చెను.

''ఈ నిర్ధనుడు ఒక్కమాసమున మూడువందల రూపాయల నెటనుండి తేగలడు? ఈతనికి రాబడియూ లేదు. ఇంత అప్పు పెట్టుట మంచిదికా''దని తలంచి 'నావద్ద అంత నేయి లే'దని భక్తరాజుతో పల్కెను.

నరసింహరాము ముందుకుబోయెను. ఒక భగవద్భక్తుడగు వ్యాపారి ఆతనికి నమస్కరించుచు ఆతని రాకకు కారణమడిగెను. నరసింహరాం తన పరిస్థితి సవిస్తరముగ తెల్పిన పిదప ఆతడు వినమ్రతతో "మెహతాజీ! మీకు ఎంత నేయి కావలెనన్న అంత మావద్దనుండి తీసికొనుడు. కాని ముందు నాకు రెండు, మూడు భగవద్భజనలు మాత్రము వినిపింపుడు" అనెను.

చాతకపక్షికి స్వాతిజలమును, నిర్ధనునకు అకస్మాత్తుగ అధికధనము దొరకినపు డెట్టి సంతోషము కల్గునో అంతకంటె ఎన్నోరెట్లు ఆనందము భక్తరాజుకు కల్గెను. జాతివారల భోజనము సాయంత్రమైన కావచ్చునుగాని ఇట్టి భగవత్సంకీ

ర్తన చేయు సదవకాశ మెట్లు లభింపగలదు? ఆ దుకాణము వద్ద ఆసనము వేసి కూర్చుని అత్యంతప్రేమతో భగవత్సంకీర్తనము చేయ మొదలిడెను. ఆతని ప్రేమపూర్ణ సుమధుర వాక్యములు విని కొద్దిసేపటిలో అచట చాలమంది ప్రోగైరి. నరసింహారాం జాతి భోజనము, పితృశ్రాద్ధము మరచి ప్రభు భజనలో మునిగెను.

భక్తరాజు భగవత్ప్రేమలో మునిగిపోయెను కాని ఏ దేవునిపై ఆతనికి గాఢప్రేమ కలదో, ఎవ డాతని యోగ క్షేమములు వహించు భారము తనపై వేసికొనెనో అట్టి ప్రభువు నిశ్చింతగ ఎట్లుండగలడు? నరసింహారాం భజనయందే పరవశుడై యున్నాడు. పితృశ్రాద్ధమునకు, బ్రాహ్మణ భోజనమునకు తగు ఏర్పాట్లు చేయవలయునని ఆతనికి లేశమైన చింత లేదు. భగవానుడు 'నేను పోయి ఆతని కార్యము సాఫల్యము చేయనిచో నేడు భక్తుని మర్యాద నష్టమగును. భక్తవత్సలుడను నాబిరుదు పోగలదు.' అని తలచి అక్రూరుని పిలచి "నీవు వ్యాపారి వేషము దాల్చి బ్రాహ్మణుల భోజనము నిమిత్తమై నీవు మెహతాజి ఇంటికి వలసిన వస్తువులను పంపుము. నేను నరసింహారాము రూపము ధరించి అచటకు వచ్చెదను" అని పల్కెను.

నరసింహారాము బజారునకుపోయి చాలసేపాయెను. మాణిక్ బాయి "నేతికొరకుపోయి ఇంకను తిరిగిరాలేదేమా? అచట ఏమిజరిగెనో? నేయి దొరకలేదా? దొరకనిచో తద్దినము బ్రాహ్మణభోజన మెట్లు జరుగగలదు? నేడు బ్రాహ్మణులు ఆకలితో మన ఇంటనుండి పోవలసిన పాపము కల్గు

నేమో? ఆయనకు తగని నిర్లక్ష్యము. ఏసాధువుల గుంపుననో చేరి ఇంటిపని మరచియుండురు. లేనిచో ఈసరికి తిరిగి రావల సినవారే. ఓ భగవంతుడా! నేడెట్లు మర్యాద దక్కును?'' అని తలచెను.

మాణిక్ బాయి ఇట్లు విచారించుచుండ భగవదాజ్ఞాను సారముగ వ్యాపారస్థుని వేషమున అక్రూరుడు సామగ్రి అంతయు గైకొని అచటకుచేరెను. మాణిక్ బాయి ప్రసన్న చిత్తయై సామానులను సర్దుకొనుచుండెను. కొద్దిక్షణములలో భగవానుడు నరసింహారాముని రూపమున నేయి తీసికొని చేరెను. ఈ రహస్యము నెవరూ ఎరుగరైరి. మాణిక్ బాయి మెహతారూపమున నున్న భగవానుని ''ఇంతజాగేలయైనది? నేను చాల విచారమున మునిగిపోతిని. ఇంతసామగ్రి ఎటనుండి సంపాదించితిరి?'' అని ప్రశ్నించెను.

''సతీ! నేడు తండ్రిగారి తద్దినమునకు నాగరజాతి కంతకు విందుచేయవలెనని భగవానునికి కోర్కెగలిగినది. ఈ సామగ్రి యంతయు ఆయన ఇచ్చినదే'' అనెను.

''నాథా! నేను వంటకు ఏర్పాట్లన్నియు చేసెదను. మీరుపోయి వెంటనే పురోహితుని తీసికొనిరండు. మధ్యాహ్న సమయమైనదిగనుక ఇపుడు శ్రాద్ధకార్యము చేయవలయును'' అని మాణిక్ బాయి పల్కెను.

నరసింహారాముని వేషమునగల భగవానుడు పురో హితుని ఇంటికి పోయి ''స్వామీ! సమయమైనది. దయచేసి మాఇంటికివచ్చి తద్దినముపెట్టించు''డని వినమ్రతతోపల్కెను.

ఈభౌతికజగత్తునందు ధనవంతునికే గౌరవము గలదు. అంతటను ధనవంతుడే పూజింపబడును. నిర్ధనుడు గుణవంతుడైనను ఆతనిని ఎవరు లక్ష్యపెట్టరు. అందువలననే ఒక నీతివేత్త ఇట్లు పల్కియున్నాడు—

"జ్ఞానవృద్ధా స్తపోవృద్ధా వయోవృద్ధా స్తథాపరే
తే సర్వే ధనవృద్ధస్య ద్వారే తిష్ఠంతి కింకరాః॥"

"జ్ఞానులు, మునులు, వయోవృద్ధులు ధనవంతుని ప్రాంగణమున దాసులుగ నుందురు." మన భక్తరాజుకూడ లోకదృష్ట్యా వాస్తవముగ నిర్ధనుడే. అతనికార్యము నెరవేర్చుటకు పురోహితుడెట్లు సిద్ధపడగలడు? ఆతని దృష్టిలో హెచ్చు దక్షిణ ఈయగలవాడే యథార్థమగు యజమాని. కనుకనే ఆతడు స్వార్థమున కన్నులుగప్పి ఇట్లుపల్కెను "నరసింహరాం! నేను వంశీధరుని ఇంటనుండి నాకు పిలుపు వచ్చినట్లు నీకు తెలియును. అతనిని కాదని నీవద్ద కెట్లు రాగలను?"

"స్వామీ! నేనుమాత్రము మీ యజమానిని కానా? మీ దృష్టిలో యజమాని ధనవంతుడైనను, నిర్ధనుడైనను సమమేగదా?" అని నరసింహ రూపధారియగు భగవానుడు పల్కెను.

"యజమానులందరు సమానులెట్లవగలరు? నీవు జీవితములో ఒక్కసారి నన్ను పిలచితివి. వంశీధరుడు ఎల్లవేళల ఆహ్వానించుచునే యుండును. నేడైనను భిక్షుకుడవగు నీవేమి దక్షిణ ఈయగలవు? నీకు వంశీధరునితోడి సాటియేమి?" అని తిరస్కరించెను.

"సరే! అటులైన స్వామీ! నేటినుండి నేను నరసింహ రాముని కుల పురోహితుడను కానని రాజీనామా వ్రాసి ఇందు. నేను వేరొక బ్రాహ్మణుని వెదకికొందును" అని భగవానుడు పల్కెను.

పురోహితుడు వెంటనే రాజీనామా వ్రాసి ఇచ్చెను. కాగితము గైకొని భగవానుడు వెడలెను త్రోవలో నిర్ధనుడగు ఒక బ్రాహ్మణుడు కానవచ్చెను. "స్వామీ! మీరు మాఇంటికి తద్దినము పెట్టించుటకు రాగలరా?" అని అడిగెను.

"అయ్యా! నేనేమియు చదువుకొనలేదు. కేవలము వ్యవసాయముచేసి కుటుంబపోషణము గావించుకొనుచున్నాను. నేను మీ కార్యమునకు యోగ్యుడనుకాను. ఎవరైన విద్యావంతుడగు బ్రాహ్మణుని వెదకుడు" అని బ్రాహ్మణుడు నమ్రతతో పల్కెను.

"స్వామీ! తమరే నిజమగు బ్రాహ్మణులు. తమ కన్నియు విదితములే. విద్వాంసుడైనను ఏ బ్రాహ్మణుడు అహంకార మదాంధు డగునో అతడు బ్రాహ్మణత్వమునకు దూరుడు. అట్టి బ్రాహ్మణునితో నాకు నిమిత్తములేదు. తమరు మా గృహమునకు విచ్చేయుడు. తమవలననే మా కార్యము నెరవేరగలదు" అని భగవానుడు పల్కి ఆ బ్రాహ్మణుని ఇంటికి గొంపోయెను.

భగవ దాజ్ఞానుసారముగ గృహమున శ్రాద్ధమునకు వలయు సామగ్రి యంతయు సిద్ధముగనుండెను. భగవానుడు తద్దినము పెట్టుటకు కూర్చుండెను. భగవంతుని స్పర్శమాత్రమున విద్యావిహీనుడగు బ్రాహ్మణుడు సమస్తవేదశాస్త్ర

పారంగతు డయ్యెను. ఆతడు విధిపూర్వకముగ శ్రాద్ధమును నెరవేర్చెను. ఏ దేవుడు —

"మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం"

మూగివానిని వాచాలునిగను, కుంటివానిని పర్వతముల లంఘించువానిగ చేయునో అట్టి వా డిట్లు చేయుటలో ఆశ్చర్యమేమి గలదు? తద్దినము పూర్తికాగనే భగవానుడు బ్రాహ్మణునకు ఏబది స్వర్ణముద్రలు దక్షిణ ఇచ్చెను. అత్యాదరమున భోజన మిడెను. నాగర వేషధారులగు భగవానుని అనుచరులు నాగరజాతివారి నందరిని బిలచి ప్రేమాదరమున భోజన మిడిరి. ఎల్లరు సంతసించిరి. ఇట్లు సాయంకాలము వరకు భక్తరాజుని కార్యమంతయు సమాప్తము గావించి తన అనుచరులతోడి భగవాను డంతర్హితుడయ్యెను.

కార్యమంతయు పూర్తికాగనే మాణిక్ బాయి భోజనమునకు కూర్చుండెను. సరిగ అదే సమయమున భక్తరాజు చేత నేతిపాత్రతోడ ఇంట ప్రవేశించెను. చాల ఆలస్యమగుట వలనను, తద్దినము పెట్టకపోవుటవలనను ఆతని మనమున చాల బాధగ నుండెను. అతనిని చూడగనే మాణిక్ బాయి ఆశ్చర్యమున "స్వామీ! బ్రాహ్మణభోజన మైన, మరల నేయి తీసికొనువచ్చుచున్నా రిదేమి?" అని ప్రశ్నించెను.

"అదె! నీవు చెప్పునదేమి? బ్రాహ్మణభోజనము, తద్దినము అయినదా? నేను ఉదయము నేయికై పోయి ఇప్పుడు తిరిగివచ్చుచున్నాను. త్రోవలో ఒక భక్తుని ఇంట భజనలో మునిగియుండుటచే ఆలస్యమైనది" అని నరసింహారాం ఆశ్చర్య

మున పల్కెను. "అట్లైన యథావిధిగ తద్దినము పెట్టి, వేల కొలది బ్రాహ్మణులకు భోజన మిడిన దెవ్వరు? తమరే ఇదం తయు చేయుచున్నట్లు నేను స్పష్టముగ చూచితిని. నాతోడి వేళాకోళము చేసెదరేల?" అని ఆశ్చర్యమున మాణిక్ బాయి పల్కెను.

"ప్రియా! నేను హాస్యములు పల్కుటలేదు. నేనిపుడే వచ్చుచున్నాను. ఇయ్యది అవశ్యము నా ప్రియతముడగు శ్రీకృష్ణునికార్యము. నారూపముధరించి ఆయన నాధర్మము కాపాడినాడు. భగవానుని దయ ఎంత దొడ్డది?" ఇయ్యది మాటలాడుచుండగనే దంపతు లిరువురి నేత్రముల వెంబడి ప్రేమాశ్రువులు జొచ్చినవి. వారు అత్యంతప్రేమతోడి భగవద్భజన చేసిరి.



## భజన ప్రభావము

నే డేకాదశి. ఏకాదశీ వ్రతముచేసి పగలెల్ల భగవద్భజన గావించుట భక్త దంపతుల నియమము. కనుకనే నేడు నిత్యకర్మలు గావించి ఇరువురు భగవద్భజనలో కూర్చుండిరి. ఇతర దినములయందు భోజనాది జంఝాటముచే భజనల కొకింత భంగము వాటిల్లెడిది. నేడదియు లేదు. అందు వలన నేడింకను ఆనందదినము. నిశ్చింతగ ఇరువురు భజన సల్పుచుండిరి. నేడు ధార్మిక కార్యములందు శ్రద్ధలేని నవ యువకులు ఏకాదశి మొదలగు వ్రతములు, ఉపవాసములు,

అనావశ్యకములని తలచెదరు. ఇదంతయు ఆరోగ్యమునకు భంగమని భ్రమించెదరు. మన ప్రాచీన ఋషులు ఏకాదశి మున్నగు వ్రతములు ధర్మములని బల్కి మనకెంతయు ఉపకారము గావించియున్నారు. మనము ధార్మికదృష్టిగాక వైజ్ఞానికముగ జూచినను ఈ వ్రతములకు గొప్ప మహిమగలదు. దశేంద్రియములు, మనస్సు నిగ్రహించుట మనుజున కావశ్యకమని ఎల్లరు ఒప్పుకొందురు.

మాణిక్ బాయి జ్వరముచే అస్వస్థతగనుండెను. అయినను ఆమె శరీరమును లక్ష్యపెట్టక భర్తతోడ భజన సల్పుచుండెను. "కోటి జన్మార్జితే పుణ్యే కృష్ణే భక్తిః ప్రజాయతే" కోటిజన్మలందు చేసిన పుణ్యముచేతనే కృష్ణునియందు భక్తి కల్గునను శాస్త్రవాక్యము లక్ష్యముగ నుంచుకొని ఆమె తన మనుష్య జన్మమును సఫలము గావించుకొనుచుండెను. ఈ మాయా జగత్తునుండి వెడలి భజనానందలోకమున విహరించుచున్నట్లు భగవత్ప్రేమలో మునిగిపోయిరి.

భజన చేయుచుండగనే సాయంకాలమయ్యెను. భక్తరాజు భజన సమాప్తిగావించి స్నానముచేయుటకై ♦దామోదరకుండి వద్దకు వచ్చెను. స్నానమయిన పిమ్మట ఆతడు సమీపమునగల తోటనుండి పుష్పములు, తులసీదళములు సేకరించి గృహోన్ముఖుడయ్యెను. ఆతని నోటనుండి "హరేకృష్ణ

---

♦ నరసింహ మెహతా నిత్యము ఈలోయచెంతకు స్నానార్థమై పోవుచుండెడివాడు. నేటికిని ఈ కొలను జునాగఢ్ కు రెండు మైళ్ళ దూరమున గల గిరనార్ పర్వతములలో గలదు. దూర దూరములనుండి యాత్రికులు ఈ దామోదరకుండిలో స్నానముచేయ వచ్చుచుందురు.

హారేకృష్ణ కృష్ణ కృష్ణ హారే హారే'' అను ధ్వని నిరంతరము బయల్వెడలుచుండెను. శ్రోవన అకస్మాత్తుగ ''భక్తరాజ్! శ్రీకృష్ణకు జై''అను శబ్దము ఆతని చెవిని పడెను. సచేతనుడై చూడగనే ఒక మాలవాడు చేతులు జోడించి నమస్కరించి యుండుట అతనికి కానవచ్చెను. చాలకాలమునుండి అతనికి భక్తరాజుపై అత్యంతశ్రద్ధకలదు. ఆతడు నిత్యము స్నానము చేసి మరలు సమయమున భక్తరాజు దర్శనము చేయుచుండెను. ఆతని దృష్టిలో భగవానునికిని భక్తునికిని భేదము లేదు. నరసింహారాము ''ఆత్మవత్సర్వ భూతేషు'' అను భావము కలవాడు. తిరిగి ''జై శ్రీకృష్ణభక్త''అని ఆతడు బదులు పల్కెను.

అంత్యజుడు ''స్వామీ! నేను తమతో కొన్ని విషయములు విన్నవించుకొన దలచితిని.'' అని నమ్రతగ బల్కెను. నరసింహారాం ''సోదరా! నాతో చెప్పుకొనవలసిన అవసర కార్యమెద్ది? నేను శ్రీకృష్ణనామము తప్ప వేరెద్దియు ఎరుగను. అయినను నేను చేయగలది ఏమైనయున్న సంకోచింపక తెల్పుము'' అని అభిమాన రహితుడై పల్కెను. మెహతాజీ నేను లోకకార్యములకై ప్రార్థించుట లేదు. నేడు నేనుకూడ ఏకాదశీ ఉపవాసము చేసితిని కనుకనే జాగరణకొరకై రాత్రి భజనసేయ దలచితిని. తమరు నాప్రార్థన నంగీకరించి నాగృహము పవిత్రము చేయగలరా?'' అని ఆతడు శ్రద్ధతో తనకోర్కెను విన్నవించెను.

''సోదరా! ఈపనికై ఇంతగ ప్రార్థింపవలసిన అవసరమేమి? నాపని భగవద్భజన సేయుటయే గదా! అంతేగాక స్వయముగ భగవానుడిట్లు పల్కియున్నాడు.

"నాహం వసామి వైకుంఠే। యోగినాం హృదయేనచ,
మద్భక్తా యత్ర గాయంతి। తత్ర తిష్ఠామి నారద.

(నేను వైకుంఠమునను, యోగుల హృదయమునను నివసించను. నారద! నాభక్తు లెచట నా భజనలు సల్పుచుందురో అచట నివసింతును) ఎవడు భగవంతుని నామోచ్చారణ చేయునో ఆతడు హీనజాతివాడైనను దేవతలతో తుల్యుడు. ఎవడు భగవద్భజన ప్రభావ మెరింగియు భగవానుని వైపు దృష్టి మరల్చడో అట్టివాడు ఉచ్చకులమున జన్మించినను ఆత్మహత్య గావించుకొనిన వాడగును. భగవానుని భజించుటకును, ఆతని కథలు వినుటకును బ్రాహ్మణుడు మొదలు చండాలుని వరకు అందరకు సమానాధికారము కలదు. శ్రీమద్భగవద్గీత యందు బ్రాహ్మణులు గోవులు, ఏనుగులు, కుక్కలు, చండాలురు వీరలందు సమదృష్టి కలవాడు నిజమగు జ్ఞానియని చెప్పబడియున్నది. సామాజిక వ్యవహారములలో భేదములుండిన ఉండవచ్చును. భగవానుడు సమదృష్టి కల్గియుండవలెనని పల్కియున్నాడు. అన్ని విషయములందు సమానముగ వర్తింపకున్నను భజనయందు మాత్రము అందరకు సమానాధికారమున్నది. కాన నీవు నీప్రాంగణమున తులసి వృక్షము వద్ద గోమయముచే అలికించి భజనకు ఏర్పాటుచేయుము. నేను నీ ఇచ్ఛానుసారముగ నేటిరాత్రి నీగృహమున భగవద్భజన చేసెదను.

ఈవిధముగ భక్తునకు మాటఇచ్చి నరసింహారాము ఇంటికి చేరెను. అంత్యజుడు అన్నియు సిద్ధపరచి ఇతర సాధువులను భక్తులనుకూడ పిలచెను. నరసింహారాము తన

ఇంటివద్ద భగవంతుని పూజించి కరతాళములు, మృదంగము, మొదలగు సామాగ్రి గైకొని భక్తుని ఇంటికివచ్చి భజన సేయ నారంభించెను. ఆతడు బాహ్యప్రపంచము పూర్తిగ మరచి భగవత్ప్రేమలో మునిగిపోయెను. ఆతని నేత్రముల వెంబడి ఆనందాశ్రువులు కారజొచ్చెను. అధికోత్సాహమున భజన సేయుచుండెను. అతనికి ఇరుప్రక్కల కూర్చుండిన శ్రోతలు మంత్రముచే కట్టబడిన సర్పము పగిది ఏకాగ్రత తోడ భజనానంద మనుభవించు చుండిరి. ఆసమయమున అచట శాంతి, పవిత్రత, ఆనందముల యొక్క సామ్రాజ్యము వ్యాపించియుండెను. ఇట్లు రాత్రి అంతయు భక్తరాజు భజన సేయుచునే యుండెను.

ఇంటివద్ద మాణిక్ బాయి జ్వరము తీవ్రము కాదొడంగెను. ఆసమయమున గృహమందామెకు పరిచర్య చేయు వారెవ్వరును లేరు. ఆమెయు నిరంతరము భగవన్నామమునే ఉచ్చరించు చుండెను. స్మృతిహీనయైనను, ఆమె నాలుక భగవంతుని పిలచుచుండెను. ఆమె లోకవాసనలవీడి సమాధి యవస్థలలో కేవలము భగవంతునితోడి సంబంధ మేర్పరచు కొనెను. ప్రాతఃకాలము భజనానంతరము నరసింహారాము ఇంటికి వచ్చి చూడగనే భార్య మరణాసన్నయై యుండెను. కొన ఊపిరితోడ ఆమె ఉండెను. నరసింహారాము ఆమెకు పరిచర్యలు చేయదొడగెను. భగవన్నామము వినిపించుచు ఆమె శుశ్రూష చేయదొడగెను. కాని విధివిధానము వేరుగ నుండెను. భర్తరాగానే ఆమె నేత్రములు తెరచి ఆతనిని చివరిపర్యాయము వీక్షించి ఈ మర్త్యలోకమునుండి వీడెను.

అదృశ్యము వజ్రహృదయుని కూడ కరగించునట్టిది. నవవివాహితుండు ఏకైకపుత్రుండు అగు శ్యామలదాసు మృత్యువు, ప్రౌఢకాలమున సహధర్మచారిణి మరణము ఈ రెండు విపత్తులు ఒకేపర్యాయము కల్గుట ప్రపంచమునగల దుఃఖమునకు పరమావధి. కాని వీతరాగుండు, భక్తప్రవరుండు అగు నరసింహమెహతా చలింపలేదు. అతడు వాస్తవమునకు ఈ జనన మరణ మయమగు లోకవిషయములకు అంటికొని యుండడు. ఆతడు నిరంతరము దివ్యలోకమున నివసించు చుండును. అచట ఆనందము ప్రవహించుచుండును.

భార్యావియోగమును గూర్చి "ఏప్రపంచమున ఏవస్తువుతో కూడ నేను వసించుటచే కుటుంబీకుడ ననిపించుకొనుచున్నాడనో అట్టి భార్యనుగూడ పరమాత్మ నానుండి వేరు చేసెను. ఇదియు భగవంతుని అనుగ్రహ"మని భక్తరాజు తలంచెను. గతించినదానినిగూర్చి చింత పడకుండుట మనుజుని కర్తవ్యము. భగవదేచ్ఛవలన జరుగు కార్యములన్నియు న్యాయపూర్ణములు, మంగళకరములుగ నుండును. దుఃఖములు వచ్చినవని విచారించిన మనుజున కేమిలాభము ? గీతలో శ్రీకృష్ణభగవాను డిట్లు తెల్పియున్నాడు.

"యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః. 12-17

"ఎవ డెపుడు సంతోషింపడో, ద్వేషించడో, దుఃఖింపడో, భోగ్యముల కోరడో, ఎవడు కర్మఫలములను త్యజించునో అట్టి భక్తుడు నాకు ప్రియుడు." కాన ఈ ప్రాపంచిక క్షణికసుఖము కల్గినపుడు సతోషించుట, పోయినపుడు

దుఃఖించుట, భగవదాజ్ఞను ఉల్లంఘించుట వంటిది.'' అని తలచి శాంతహృదయుడై విధిపూర్వకముగ దహనసంస్కారము గావించి అస్థులను గంగలో కలిపి ఇంటికిచేరెను.

మాలవానిఇంట భజనచేసిన సమాచారము నాగర జాతియంతట వ్యాపించెను. దుర్జనులు ఇతరుల లోపములు వెదకుటయందు మెలకువుగనే ఉందురు. పరులను ద్వేషించుటయే తమ కర్తవ్యమని తలతురు. ఇట్టి నాగరకులకు నరసింహారాముని నిందించుట కొకమంచి అవకాశము దొరకెను. నరసింహారాముని గూర్చిన ఈచర్చ నలుమూలల తీవ్రము కాజొచ్చెను.

''ఆభక్తుడిపుడు జాతిమర్యాదనుకూడ గంగపాలు చేసినాడు. హద్దుమీరి మారిపోయినాడు. మనదౌర్భాగ్యవశమున మన జాతియందిట్టి కొంగభక్తుడు జన్మించినాడు'' అని ఒక నాగరయువకుడు ప్రారంభించెను.

''అసలు విషయమేదియో స్పష్టముగ తెలియచెప్పుము. ఆగారడివాడనిన నీకు భయమా ?'' అని సారంగధర మెహతా గంభీరముగ నడిగెను.

''ఏమి! మీరావిషయమే వినలేదా? నిన్న భజన నెపమున రాత్రిఅంతయు ఒక మాలవాని ఇంటపడి ఉం[illegible]ట అందరికిని తెలియును. ఆతడిట్లు చేయుచునే యుండిన నాగర జాతి యంతయు నశించు''నని ప్రసన్నరాయడు వృత్తాంతమంతయు తెలియజెప్పెను.

అచట నున్నవారందరిలోను కోలాహలము కల్గెను. అందరును ఈ విషయమున తమ తమ ఉద్దేశములు తెలియు

జెప్పదొడగిరి. ''ఇది కలికాలము! ఉన్నత కులోత్పన్నుడగు బ్రాహ్మణుడు రాత్రిఅంతయు మాలవాని యింట గడిపినాడు. భూమాత ఈ పాపభారమంత యెట్లు సహింపగలదు? నావంటి వృద్ధుడు ఈ లోకమున జీవించుట ఇక నిరర్థకము'' అని ఒక వృద్ధ నాగరకు డనెను. ''ఇట్టి అధర్మము జరుగుచుండిన త్వరలోనే ప్రళయము కాగల''దని వేరొక వృద్ధు డనెను. ''ఈ పతితుల పాపముల నెంతవరకు చూచుచుండగలము? నేడే ఆతనిని జాతినుండి వెలివేయుడు. ఆతడే త్రోవలోనికి వచ్చు''నని మరొక నాగరకుడు తీర్పు చెప్పెను. ''ఆత డచటకు కేవలము భజనకై పోయినాడు. అన్నపానాదు లెవ్వియు చేయలేదు గదా?'' అని వేరొకడు తెల్పెను. అచట గలవారందరు వెలివేయుటయే నిశ్చయము చేసిరి. పెద్ద నగారాధ్వనులముందు పిల్లనగ్రోవి మ్రోతలు వినపడునా? నేటినుండి నరసింహ మెహతా కులభ్రష్టుడైనాడు. ఆతని తోడి అన్నపానాదులు పనికిరావని నిర్ణయింప బడినది. ఈ విధముగ భక్తరాజును వెలివేసి జాతి పెద్దలందరు తమ కులముయొక్క పవిత్రతను రక్షించుకొంటిమని సంతసించిరి.

మరునాడు కృష్ణరాయుడను ఒకనాగరునితల్లి శ్రాద్ధము నిమిత్తమై జాతి భోజన మేర్పాటు చేయబడెను. ఆబాల వృద్ధులెల్లరు ఆహ్వానింపబడిరి గాని బహిష్కరింప బడిన నరసింహ మెహతాను మాత్రమెవ్వరు పిలువలేదు. సాయం త్రము కృష్ణరాయని ఇంటివద్ద చేరి మడిబట్టలు ధరించి భోజ నమునకు కూర్చుండిరి.

నరసింహారామున కింతవరకు తాను జాతి చ్యుతుడ నయితినన్న విషయము తెలియదు. ఆతనికి తెలిసికొను నంతటి అవకాశమెక్కడిది? నిజమగు భగవద్భక్తుడు ఒక్క క్షణమైనను తన ప్రభువును మరచియుండుట మరణముకంటె దుఃఖకరమని భావించును. కాని తన ప్రతిజ్ఞానుసారముగ భగవానునికిమాత్రము ఆచింత ఉండనే ఉండును. భగవానుడు తనకు అవమానము కల్గిన సహించునుగాని భక్తుల అవమానము సహింప నేరడు. అతడు నాగరకులపై భక్తరాజునకు జరిగిన అవమానమునకు పగతీర్చుకొనదలచెను. ఆతడు వెంటనే తనమాయను కల్పించెను. నాగరకులు భోజనము చేయుచుండ తమలో ప్రతివాని ప్రక్కన ఒక మాలవాడు కూర్చుండి యున్నట్లు కానవచ్చెను. ఈ దృశ్యము చూచి అందరు భోజనము వదలి పారిపోవ నారంభించిరి.

జాతియందలి ప్రధాన నాగరికుడగు సారంగధరుడు చింతాక్రాంతుడై "అనంతరాయా! ఇది చాలఆశ్చర్యము. ఈ మాలవాండ్రమధ్యన భోజనము చేయుటచే మనము అపవిత్రులమైతిమి. మన మెల్లరము ఇప్పుడు గంగాస్నానము గావించి ప్రాయశ్చిత్తము చేసికొనవలయుగాని వేరు ఉపాయమేదైనగలదా?" అని ప్రశ్నించెను. "సారంగధరా! భక్తుడగు నరసింహారాముని కులభ్రష్టునిగ చేసినందువలన కలిగిన పరిణామమిదియని తోచుచున్నది. ఇప్పుడు మనము చేసిన దానికి ఫలమనుభవింప వలయును." అని అనంతరాయుడు పల్కెను. "అయిన మీరందరు ఆమాయలమారి చేసిన కీలుబొమ్మలేనా?" అని సారంగధరుడు తిరిగి ప్రశ్నించెను.

"అదేమియు కాదు. నరసింహారాము శ్రీకృష్ణుని నిజభక్తుడు. ప్రాయశ్చిత్తముచే ఇతరపాపములను పోగొట్టుకొనగలముగాని ఒకభక్తునికి గావించిన అపరాధపాపమునుండి గంగాస్నానము వలనగాని తదితర ప్రాయశ్చిత్తములవలనగాని విముక్తులము కానేరము. నా మాటపై మీకు ఏమాత్రమైన విశ్వాస మున్నచో వెంటనే వీతరాగుడగు ఆమహాత్ముని పాదములపై బడి ఆయనను క్షమాపణ అర్థించి భోజనమునకు పిలువుడు. ఇదియే మన అపరాధమునకు ప్రాయశ్చిత్తము" అనిచెప్పెను.

అనంతరాయడు నరసింహారామునకు మేనమామ. విద్య, నడత, వాక్పటిమ, నమ్రతవలన జాతికంతయు ఆయన యనిన చాలగౌరవము కలదు. కావున జాతివారందరు ఆయన మాటల విశ్వసించిరి. జాతిలో ఇరువురు పెద్దలు అపుడపుడే నరసింహారాముని ఇంటికివెళ్ళిరి. ఆసమయమున నరసింహా రాముడు భగవానునికి నైవేద్య మి[illegible]చుంచెను. వచ్చిన పెద్దలు ఆయనకు నమస్కరించి జాతి భోజనమునకు రమ్మన మని ఆహ్వానించిరి. "సోదరులారా! నాకడ మీరంత వినయు లగుటేల? ఇట్టి ప్రార్థన భగవానునికి చేయవలయును. నేను తుచ్ఛసేవకుడను మాత్రమే. నాయెడ విశేషమేమియులేదు" అని వినమ్రుడై పల్కెను. వాస్తవముగ నిజభక్తుడెవడును స్వాభిమానము కల్గియుండడు.

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు
సాధుష్వపిచపాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥ —భగవద్గీత 6-9

శత్రువు, మిత్రుడు, బంధువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, ద్వేషించువాడు, ధర్మాత్ముడు – వీరందరియందు ఎవడు సమాన

దృష్టికలవాడో వాడే భక్తుడు శ్రేష్ఠుడు. ఈ శ్లోకానుసారము నిజముగ భక్తులు సమాన భావముకలిగి యుందురు. నరసింహ రాముకూడ నిజమగు భగవద్భక్తుడు. అతడు వెంటనే జాతి భోజనము చేయుట కంగీకరించెను. నరసింహరాము పంక్తి లోనికి వచ్చి భోజనముచేయు మొదలిడినంతనే మొదటి దృశ్యము తొలగిపోయినది. అందరును సంతోషముగ భోజ నము పూర్తిగావించిరి ఈ విధముగ భజన ప్రభావముచే నరసింహరాము జాతి బహిష్కారమను ఆపదనుండి రక్షింప బడెను.



## శ్యామలశాహుని హుండీ

స్వార్థమయ ప్రపంచమున ధనవంతుడు, దరిద్రుడు, దాత, లోభి, విద్వాంసుడు, మూర్ఖుడు, సజ్జనుడు, దుర్జనులకు పరంపరాగతమగు స్పర్ధ యున్నది. భగవద్గీతయందు కూడ దైవీసంపద ఆసురీసంపదలకు విరోధమని చెప్పబడియున్నది. ఆవైరమున దైవీపక్షమునకు విజయము ఆసురీ పక్షమున కపజయము తథ్యము.

దైవీశక్తి సంపన్నుడగు భక్త నరసింహరాముడు ప్రథమమునుండియు ఈ దైవీ ఆసురీసంపదల మధ్య పోరా టము సల్పుచునేయున్నాడు. దానియందు లౌకికముగ పార మార్థిక దృష్ట్యా ఆతనికి విజయమే లభించుచుండెను. ఇప్పు డాతనికి మరొక ఆపదకల్గినది. ఆతనిభార్య చనిపోయి తొమ్మిది

దినములాయెను. శ్రాద్ధము పెట్టుటకు బ్రాహ్మణ భోజనము చేయింపవలసివచ్చినది. కాని ఆతడు భగవంతునిపై భారము వైచి నిశ్చింతగ నుండెను.

నాగరజాతికి సంబంధించిన ప్రముఖవ్యక్తులు తనవద్దకు వచ్చి జాతివారి కందరకు పదునొకటవ,పండ్రెండవ దినములలో భోజనము పెట్టింపుడని అడుగజొచ్చిరి. కాని నరసింహారాము పరమాత్ముని దయ యని మాత్రము చెప్పదొడగెను. ఒక నాడు ప్రాతఃకాలమందే సారంగధరుడు తనవద్దకు వచ్చెను. వచ్చుచునే "జై శ్రీకృష్ణ" యని భక్తరాజునకు అభివాదము చేసెను. భక్తరాజుకూడ "జై శ్రీకృష్ణ" యని పల్కి "దయ చేయుడు. నేడు నా పర్ణకుటీరము పావనము చేసితి" రని బదులు పల్కెను.

ఈవిధముగ రెండుమూడు మర్యాదవాక్కుల పిదప సారంగధరుడు "నరసింహారాం! నేడు నీకొక సలహాచెప్పుటకై వచ్చితిని. నీవు ఉన్నతకులోత్పన్నుడవు. నీకుల మర్యాదాను సారము మాణెక్ బాయి శ్రాద్ధమున పదకొండు పన్నెండవ దినములందు జాతిభోజనము పెట్టవలయును. ఇంతకు తక్కువ చేసిన నీమర్యాదకు భంగమువాటిల్లగల" దనిపల్కెను. భక్త రాజు "సారంగధరా! మీరు చెప్పినది బాగున్నది. కాని ఇందున వంశాచార మేమున్నది? ఇయ్యది ప్రస్తుతాచారము. శక్తినిమించి ఏపనిచేయుటయు మంచిదికాదు. నేను ఇరువురు ముగ్గురు సాధువులకు......" సారంగధరుడు మాటలకడ్డు వచ్చి "పిచ్చివాడవగు చున్నావా నరసింహారాం? ఇరువురు ముగ్గురు బికారులకు భోజనమిడినంత మాత్రమున నీభార్యకు

పరలోకగతులు కల్గునా? జాతివారను గంగను తృప్తిపరుప కున్న ఆమెకు సద్గతు లెట్లు కల్గును? పాప మామెతోడ ఏదైన గొంపోయినదా? ఇదియేగదా ఆమెకు మనము చేయ గల్గినది. ఆమె పేరు చెప్పున నీవీమాత్రమైన చేయలేవా? మాటి మాటికి ఇయ్యది చేయముగదా?" అనెను. "అవును నీవనునది నిజమే. చనిపోయినవ్యక్తి తోడ ఏమియుగొంపోడు. వారిపేరు మీద బ్రాహ్మణభోజనము యథాశక్తి చేయించుట ఉచితమే. కాని శక్తికిమించి అనేకులకు భోజనము చేయింప నగత్యములేదు. శ్రద్ధగ చేయునదియే శ్రాద్ధము. ఆమె పేరిట ఎంతశ్రద్ధగ ఎందరకు భోజనము పెట్టించిన అమె కంతటి సద్గతి కలుగగలదు. జాతి వ్యవహారము కూడ మంచిదేకాని సాధు వులు, అనాధులసేవ అంతకన్న మిన్న. జాతిభోజనము లౌకిక విషయము." అని భక్తరాజు పల్కెను.

సారంగధరుడు ఉపదేశము కొరకై రాలేదు. జాతి కంతకు ప్రతినిధియై వచ్చెను. తన పని తాను నెరవేర్చుకొన వలయును. కనుక నరసింహరాముని తేలికగ ఎట్లు పోనీయ గలడు?

"ఉపదేశోహి మూర్ఖాణాం ప్రకోపాయన శాంతయే"

అను న్యాయానుసారముగ నరసింహరాముని ఉప దేశము లతనియెడ వ్యతిరేకములయ్యెను. ఆతడు భీషణ రూపముదాల్చి, "నరసింహరాం! ఈ నీతులు గోచిపాత రాయులగు సాధువుల కెవరికైన చెల్పుము. నేటివరకు నీవు జాతియందుండి అందరి ఇండ్లలోను భుజించితివి. నేడు నీవంతు రాగనే తప్పించుకొన జూచుచుంటివి. అట్లు జరుగుటకు వీలు

లేదు. స్పష్టముగ చెప్పుచున్నాను. రేపటినుండి రెండుదిన ములు నీవు జాతి భోజనము పెట్టవలసినదే. దీనికై నీవు ఇల్లు అమ్ముకొన్ననూ లేక నీభార్య నగలమ్ముకొన్ననూ సరియే.'' అనెను.

సారంగధరుని మాటలు విని నరసింహారాం భగవన్నామము జపించుచూ అంగీకరించెను. సారంగధరుడు విజయ గర్వమున ఇంటికి పోయెను. సారంగధరుడు వెడలిన పిదప భక్తరాజిట్లు విచారింప దొడగెను. ''జాతిభోజనము పెట్టుట కంగీకరించితిని కాని దానిని నెరవేర్చుట శ్యామసుందరునిదై యున్నది. ఆతని కోర్కె ఎట్లున్న అట్లే నెరవేరగలదు. వ్యర్థ చింత చేయుచు సమయము దుర్వినియోగము చేయనేల?'' అని తలచి భగవధ్యానమున మగ్నుడయ్యెను. అట నాగర జాతి వారందరును తమలో తాము గుసగుస లాడుచుండిరి. అదేసమయమున అచటకు నల్గురు యాత్రికులు వచ్చి నమ్రతతో ఇట్లు పల్కిరి. ''సోదరులారా! ఈ నగరమున మా ఏడువందల రూప్యముల తీసికొని ద్వారకకు హుండీ వ్రాసి ఇచ్చు ధనికవ్యాపారి ఎవ్వరున్నారు?''

వీధిలోని నాగరులందు నరసింహారాముని గూర్చిన చర్చ సాగుచుండెను. యాత్రికులమాటవిని ఒక ఈర్ష్యాళువగు నాగరుడు వెంటనే ''మీరు నరసింహారాం మెహతా ఇంటికి వెళ్ళుడు. ఆతనికి ద్వారకలో పెద్దదుకాణ మున్నది. హుండీ అచటనే స్వీకరించబడును. తమకిట్టి సౌకర్యము ఎచటను లభింపదు.'' అని పల్కెను. ఇద్దరు ముగ్గురు నాగరులు వేళా కోళమున అవునవు ననిరి. యాత్రికులు విశ్వసించి నరసిం

హారాం ఇంటికి వెళ్ళిరి. భక్తరాజు భజనముగించి భగవానుకు నైవేద్యమిడుచుండెను. యాత్రికులు మెహతాకు నమస్కరించిరి. వారికి భక్తరాజు అతిథి సత్కారములు గావించి వారిరాకకు కారణమడిగెను.

''నరసింహారాంగారూ! మేము పరదేశీయులము. జునాగఢ్‌నుండి ద్వారకకు పోవుమార్గము చోరగ్రస్తముకాన, ద్రవ్యము గొంపోవుట అనుచితమని తోచుచున్నది. కనుక మీరు ఏడువందలు తీసికొని మాకు తమరు ద్వారకకు హుండీ వ్రాసిఇచ్చిన ఎంతయు మేలుచేసిన వారగుదు''రని ఒకడు నమ్రతగ పల్కెను. ''హరిభక్తులారా! మాఇల్లు ఎవరు చెప్పిరి?'' అని భక్తరాజడిగెను. ''భక్తరాజా! దగ్గరగల వీధిలోని కొందరు తమపరిచయము తెల్పి ఇచట ద్వారకకు హుండీ లభింపగలదని నమ్మకముగ తెల్పిరి'' అని యాత్రికులనిరి. ఇదివిని భక్తరాజునకు తనజాతివారల పనికై నవ్వు వచ్చెను. సజ్జనులు దుర్జనుల అనుచితకార్యమునకెన్నడును భయపడరు. దానిని ఉపయోగమనికూడ తలచి సంతసింతురు. సముద్రములోని ఉప్పునీటిని అమృతముగ చేసి మేఘమండలము జగత్తునకు ప్రాణము నొసగుచున్నది. అనాయాచితముగ దొరకిన ఈ సంఘటనయందు అవశ్యముగ ఈశ్వర సంకల్ప ముండవచ్చును. లేదా ఈ అసంభవకార్య మెట్లు సంభవించును?'' అని భక్తరాజు తలంచెను. రేపటినుండియే భార్యయొక్క శ్రాద్ధకర్మలు చేయవలసి యున్నది. ఈ కార్యము కొరకు భగవాను డీరూపమున సహాయము పంపియుండవచ్చును. లేకున్న నాకును ఈ యాత్రికుల కెట్టి సంబం

ధము ? సమయము నాలోచించి పనిచేయువాడే వివేకి యన బడును. కనుక హుండీ వ్రాయుటకు విలంబనచేయుట మంచిది కాదు. పరమాత్ముని దయచే మంచిదశ కల్గినది. నా హుండీ ద్వారకానివాసియగు భగవానుడు తప్పక స్వీకరింప గలడని దృఢముగ విశ్వసించి భక్తరాజు ఈక్రింది విధమున హుండీ వ్రాసిఇచ్చి ఏడువందల రూప్యములు గైకొనెను.

హుండీ

సిద్ధిశ్రీ పరమశోభాధామ శ్రీద్వారకానివాస ప్రియతమ ప్రాణధార సేట్ (శ్రీ) శ్యామలశాహ వసుదేవునికి నమస్కరించి వ్రాయునది. నేనిచట ఈ నలుగురి యాత్రికులవద్ద ఏడువందల రూప్యముల గైకొని తమకీ హుండీ వ్రాసి ఇచ్చితిని. కనుక ఈ హుండీ పత్రము చూడగనే ఏడువందల రూప్యములు ఒసంగ ప్రార్థన.

జునాగఢ్ నందలి తమ నమ్రసేవకుడు,
నరసింహరాం.

హుండీగైకొని యాత్రికులు వెడలిరి. భగవానునికి నైవేద్యమిడి భక్తరాజు వినయమున నిట్లు బల్కదొడంగెను. "భక్తవత్సలా! నీపై నగల విశ్వాసముతోడనే హుండీ వ్రాసి ఇచ్చితిని. నీవు దానిని స్వీకరించి నాప్రతిష్ఠను కాపాడగలవా? ప్రభూ! నాగౌరవమర్యాదలకు దానివలన భంగము వాటిల్ల దని నమ్ముచున్నాను. లోకమున నీకే అప్రతిష్ఠ రాగలదు. దయాస్వరూపా! దామోదరా! నేటినుండి రెండుదినముల వరకు జాతిభోజన మిడవలయునని నీకుమాత్రము తెలియదా?

అందువలననే ఈపని గావించితిని. అదియును కేవలము ఏడు వందలుమాత్రమే. జగన్నాథా! నీ కోశాగారమునకు ఏడు వందల రూప్యములొక లెక్కయా? మరణోన్ముఖుడగు గజేంద్రునికి ప్రాణదానము చేసితివి. ద్రౌపదికి నిండుసంభలో అక్షయవలువలొసగి ఆమె మర్యాద కాపాడినావు. నా కుమారుని వివాహమందును, నా తండ్రిగారి శ్రాద్ధ కార్యమందును, మరియు ఇతర లౌకిక కార్యములందును, నీవు నాకు సహాయము చేసియున్నావు. ఈ ఏడువందల రూప్యములకు తగు ఏర్పాటు చేయలేక పోదువా?'' అనుచు భక్తరాజు అశ్రుపూర్ణ నేత్రముల పల్కెను. భగవానుని పాదములపై బడి దొరలెను. అట్టిస్థితియం దాత డెంత కాల ముండెనో అతని కే తెలియదు. మరునాడు ప్రాతఃకాలమున జాతి భోజనమున కేర్పాట్లు సిద్ధమగుచుండెను. వలసిన సామాగ్రి బజారునుండి వచ్చెను. అట్టహాసముగ జాతి భోజనము రెండునాళ్ళు జరిగెను. జాతివారు సంతృప్తి నొందిరి.

*                    *                    *

నల్గురు తీర్థయాత్రికులు యథాసమయమున ద్వారకకు చేరిరి. వారు ద్వారకాధీశుని దర్శించినపిమ్మట హుండీద్రవ్యము తీసికొనుటకై శ్యామలశాహావసు దేవు నన్వేషింప దొడగిరి. బజారునం దెవరును ఆతని జాడ దెల్పరైరి. యాత్రికులు ఆశ్చర్య చకితులైరి. వారి మనమున సందేహము కల్గెను. ''ఆభక్తుడు మనల మోసగింపలేదు కద! అట్లే జరిగిన జూనాగఢ్‌నం దాతని గృహముకలదు కదా? ఆతడెచటకు పోగలడు? ఆతడు ఎటులైనను ఈయవలసినదే. చూచుటకు

సత్పురుషుడగనున్నాడే? ఆతడు మోసగించునా? మరి ఇచట శ్యామలశాహుని పేరు ఊరైన లేదు." అని ఆలోచించుచు ఆసేట్‌ను వెదకుచూ దినమంతయు గడిపిరి. ఎవ్వరును జాడ తెల్పరైరి. యాత్రికులు నిరాశ చెందిరి. "ఆసేట్ జాడ తెలియుట కష్టము. జునాగఢ్‌కుపోయి డబ్బు వసూలుచేసికొందము" మని తలచిరి.

రెండవదినము అమావాస్య యగుటచే ద్వారకలో యాత్రికులు గుంపులుగ నుండిరి. పండాలు తమ యజమానుల పాపనివారణార్థమై వారలను విధిపూర్వకముగ గోమతిలో స్నానము చేయించుచుండిరి. భగవద్దర్శనమునకై ప్రజలు ఆలయమున క్రిక్కిరిసియుండిరి. అన్నిచోట్లయందును "గోమతీ మాతకు జై" ద్వారకాధీశునకు జై" అనుధ్వనిచే ఆకసము ప్రతిధ్వనించు చుండెను. అదేసమయమున భక్తవత్సలుడగు భగవానుడు భక్తకార్యార్థియై సేట్‌రూపమున వచ్చెను. ఆతనితోడ గుమాస్తా వేషమున అక్రూరుడు ఖాతాపుస్తకములు, కలము, కాగితము, సిరాబుడ్డి కలిగిఉండెను. మందిరమువద్ద ఒక అరుగుపై కూర్చుండెను. యాత్రికులు నల్గురు గోమతియందు క్రుంకులిడి దేవాలయమునకు వచ్చిరి. వారు భగవానుని దర్శించినపిదప జూనాగఢ్‌కు బయలుదేరిరి. దేవాలయమునుండి వచ్చుచుండగ వారలదృష్టి అరుగుపైన గల వారలపై పడెను. వీరలనుకూడ అడిగి మరి పోవుదమని తలచి వారలలో ఒకరు "తమ పేరే"మని అడిగిరి.

"నాపేరు శ్యామలశాహవసుదేవు"డని సేట్‌రూపధారి యగు భగవానుడు పల్కెను. ఈ మాటలు విన్నంతనే

యాత్రికుల శుష్కహృదయములపై ఆశామృతము వర్షించెను. అనాయాసముగ సేట్ కలియుటచే వారికి అపారమగు ఆనందము కలైను. వారు వెంటనే సేట్‌కు హుండీ ఒసంగిరి. సేట్ హుండీచూచి వెంటనే గుమాస్తాకు ఏడువందలు చెల్లింపుమని ఆజ్ఞ ఇచ్చెను. అక్కారుడేడువందలు లెక్కించి యాత్రికులకిచ్చెను.

యాత్రికులు రూప్యముల లెక్కించి తీసికొనిరి. హుండీపై ముట్టినట్లు సంతకముల చేసిరి. ధనము ముట్టిన పిదప యాత్రికులు నరసింహారాముని ప్రశంసించి ఆతని స్థితియంతయు సేట్ రూపధారి యగు భగవానునికి తెల్పిరి. భగవానుడును భక్తుని అభినందించుచు "నరసింహారాం నాకు పరమస్నేహితుడు. నేనాతడు చెప్పినట్లు నడచుకొనువాడ''నని తెల్పెను. ఈవిధముగ నరసింహారాముని హుండీ ధనము చెల్లించి భగవానుడు తాను ''భక్తవత్సలు''డను బిరుదమును అక్షయము గావించుకొనెను.



# కుమారబాయి సంసారము

కలసి మెలసి యుండుట మన భారతీయులకొక ముఖ్యలక్షణము. ఈ పద్ధతి గార్హస్థ్య జీవితమును శాంతియుతముగ చేయుటలో సహాయకారి యగుచున్నది. కాని మన అజ్ఞానముచే గృహకలహములు బయలుదేరుచున్నవి. ఈ కారణమున అనేక కోమల యువతులు అకాలమరణము చెందుచున్నారు. సంపన్న గృహములుకూడ దుఃఖసాగరమున

మునిగియున్నవి. ఈ కలహములు స్వల్పకారణముల వలన కలుగును కాని అయ్యవి అహర్నిశములు పరివారము నగ్నివలె దహించుచున్నవి. యజమానికి వానిని చల్లార్చుట అసంభవమగుచున్నది. న్యాయాధీశుడు న్యాయస్థానమున కూర్చుండి జటిలసమస్యలనైన పరిష్కరింప గల్గుచున్నాడు కాని గృహ సమస్యలను ఒకదరికి చేర్చలేకున్నాడు. డిగ్రీలు పొందిన డాక్టర్లు భయంకర రోగములను ఔషధముల నొసగి పార ద్రోల గల్గుచున్నారుగాని ఈ గృహరోగములను మాత్రము తొలగింపలేకున్నారు. భారతీయుల యీ భయంకర గృహ కలహముల నింతకంటె ఇంక నేమని వర్ణింపగలము? భగవానుడీమహామారినుండి మనల రక్షించునుగాక.

నరసింహరాముని ప్రియపుత్రికయగు కుమారబాయి వివాహము గొప్పఇంట జరిగెను. ఆమె అత్తవారింటకు వచ్చినది మొదలుకొని తన కులోచిత ధర్మములు నెరవేర్చుచుండెను. పనిపాటలు చేయుచు అందరిని ఆదరాభిమానములతోడ చూచుచుండెడివి. అయినను పాపమామెకు ఇంట గౌరవము సున్న. ఇంటియందెల్లపుడును పోట్లాటలుండెడివి. అత్తగారు, తోడికోడలు, ఆడుబిడ్డ ఆమెపై మాటలబాణములు విసరెడువారు. అసలే ఆమె బీదఇంటి పిల్ల. ఆమె భర్త వ్యసనపరుడు క్రోధి. అందుచే ఆమె మొర నాలకించువారు వేరెవ్వరును లేరు. అందుచే ఆమె లోలోన క్రుళ్ళుచుండెడిది.

ఇవియేగాక మూడవకారణము కూడ వచ్చి పడినది. వివాహమై మూడేండ్లయినను ఆమెకు సంతానప్రాప్తి కలుగ లేదు. సమాజమున సంతానహీనులగు కులస్త్రీలను అభాగి

నులుగ తలంతురు. వారల ననేక దుర్భాష లాడుచుందురు. కుమారబాయి ఇతరదుఃఖముల సహింపగల్గినను ఈదుఃఖ మామెకు అసహనీయమాయెను. ఇందు ఆమె దోష మేమున్నది? చేయగల్గినది మాత్ర మేమి? కుమారబాయి మామగారగు శ్రీరంగధర మెహతా ఉన్నతోద్యోగి. ఆతడు దయాళువు. ఆతనికి కోడలు పడు కష్టములు తెలిసినను ఈమె విషయమున ఏమి చేయుటకును అసమర్థుడు. పాపమామె మూగిపశువువలె అన్నియు సహించుచు భగవానుని యెదుట మొరబెట్టుకొనుచుండెను.

ఎపుడు మానవుడు అన్నియాశలను వదలి భగవానుని దీనభావమున పిలుచునో, అపుడే భగవంతుడు వారి మొర నాలకించి కష్టముల తీర్చునని పెద్దలనుడి. చివరికి అసహాయురాలగు కుమారబాయి మూగధ్వని భగవానునివరకు చేరెను. ఆతని కామెపై కృపకల్గెను. ఆమె గర్భముదాల్చి ఏడెనిమిది మాసము లాయెను.

గుజరాతునందు కోడలి సీమంతము చాల అట్టహాసముగ రెండుదినములు జాతి భోజనములతో చేయబడును. గర్భవతి తండ్రి వియ్యాలవారికి అందరికి వస్త్రముల పెట్టవలయును. ఉన్నతకులములందు సీమంత సంస్కారము వేదవిహితముగ జరుగును. కుమారబాయి సీమంత ముహూర్తము మాఘశుక్ల సప్తమినాడు నిశ్చయింప బడినది. బంధువుల కాహ్వానపత్రికలు పంపబడినవి. కాని కుమారబాయి తండ్రియగు నరసింహరాం నిర్ధనుడగుటచే ఆతనికి కుంకుమపత్రిక పంపబడలేదు. ఈ విషయము కుమారబాయికి తెలిసి చాల

దుఃఖించి అత్తగారికడకు పోయి బహునమ్రతతో "అత్త గారూ! జూనాగఢ్‌లోని మా తండ్రికడకు ఆహ్వాన పత్రిక పంపలేదా?" అని అడిగెను. "పత్రిక పంపినను ఆతడేమి చేయగలడు? ఇంత పెద్దకుటుంబమునకు వస్త్రము లెట్లీయ గలడు? ఆతని ఇంట శంఖములు మాత్రము మ్రోగుచున్న" వని కోపమున అత్తపలికెను. "అత్తగారూ! మీరు చెప్పినది నిజమే. కాని తలిదండ్రులకు సంతానముపై ప్రేమ మీకు తెలియనిది కాదు. స్థితిగతులు చెడినను ఆతడు తనకున్నంతలో ఈ కార్యమును తప్పక నెరవేర్పగల"డని కుమారబాయి పల్కెను. "అమ్మా! వదినె చెప్పినది నిజమే. తప్పక పిలుపు పంపు. సాధువులతోడవచ్చి మనకందరకు గోపీచందనము, తులసీ హారములు, కౌపీనములనిచ్చి తనవలె మనలగూడ సాధువు మార్చు శక్తి గల"దని కుమారబాయి ఆడుబిడ్డ నిష్ఠురముగ బల్కెను. ఆమె ఈ వ్యంగ్యభాషణ కుమారబాయి కెంతయు బాధకలుగ జేసెను. ఆమె నేత్రములవెంబడి కన్నీరు వెడలెను. కులస్త్రీలకు రోదనముకన్న బలమైన దేదికలదు? "అత్త గారూ! తాము కాఠిన్యము చూపవలదు. మాతండ్రికి తప్పక ఆహ్వానము పంపుడు. ఆతడు ఏమియు తీసుకొని రాకున్నను మనకుగల లోటులేదుగదా. మాతండ్రి వచ్చిన ఒకపర్యా యము చూచెదను. నేను వచ్చిననాటనుండి తండ్రిగారిని చూడలేదు. ఈమధ్య నా సోదరుడు తల్లిగారలు దేహాంతము గావించిరన్న విషయముకూడ మీకు తెలియునన్న" విషయము తెల్పుచుండ కుమారబాయి కంఠము రుద్ధమై వెక్కి వెక్కి ఏడ్వనారంభించెను. ఆసమయమున కుమారబాయి ఏడ్పు

వినిన వజ్రహృదయునకైన జాలికల్గక మానదు. కాని ఆమె అత్తగారికి ఒకింతయైన పట్టలేదు. ఆమె విలాపమునకు వ్యతిరేకార్థముతీసి "చూడు. గంగిగోవుమాదిరి విలపించుచున్నది. ఇక్కడ తండ్రి తండ్రి అని గగ్గోలు పెట్టునుగాని అచట ఆమె ముఖమునైన చూచువారు లేరు. అతని కేమాత్రమైన ప్రేమ యున్నచో ఇచటకువచ్చి కూతురు విషయము విచారింప కుండునా? వచ్చిననాటినుండి అచటనుండి ఒక పిట్టయైన రాలేదు. ఆతనికి అసలు ప్రేమ యెక్కడ? డబ్బు దొరికిన తినుట, టోపీ, లంగోటీ ధరించి ఎగురుట అనిన ప్రేమ.

టోపి మే హై తీన్ గుణ్ నహి మునీం నహి సేట్।
బాబా బాబా సబ్ కరే ఔర్ భరే ఖుషీ సే పేట్॥

ఆతనికి కావలసినది మాత్రమింక నేమిగలదు? పగలంతయు సాలగ్రామశిలతో నెత్తి పగలకొట్టుకొనుట......" అనుచు ఆవేశములో ఏమేమియో మాట్లాడుచుండ శ్రీరంగధర మెహతా వచ్చుటచే వాతావరణము శాంతించెను. ఆతడు భార్య కర్కశత్వము, కోడలిరోదనము విని క్రోధమున "కోడలు ఎందుకేడ్చుచున్నది? తల్లి కూతుళ్ళుకలసి ఆమె నేమి బాధించుచున్నా"రని అడిగెను. "ఏమియులేదు తనతండ్రివద్దకు కబురుపంపమన నేనవసరము లేదంటిని." అని శ్రీరంగధరుని భార్య బదులు చెప్పెను. "దీని కింతరభసయా? అక్షేపంపవచ్చు. భక్తరాజుని భజనకు అభ్యంతరము కల్గునని, ప్రయాణము శ్రమకరమనియు పత్రిక పంపలేదు. కోడలికట్టి ఉద్దేశ్యమున్న నేడే బ్రాహ్మణునిద్వారా పత్రిక పంపెద"నని శ్రీరంగధర మెహతా శుద్ధ హృదయమున ఓదార్చుచు పల్కెను.

ఆమాటప్రకారము శ్రీరంగధర మెహతా బ్రాహ్మణునిచే ఆహ్వానపత్రిక జూనాగఢ్ పంపెను. కుమారబాయి ఎంతయు సంతసించెను.

—*—

## భక్తుని కుమార్తెకు సీమంతము

సంసారమందుండియు భగవంతునియందు భక్తి కల్గియుండుట ఇరువైపుల పదునుగల కత్తితోడి ఆటవంటిది. ఇట్టి భక్తుల ఎదుట సంసారబాధలు పెద్ద గోడలవలె నిలబడును. వేరొకవైపున శుద్ధసాత్విక జీవితపు వెలుగు ఆకర్షించును. అయినను భక్తుడు భగవత్కృపచే తన సాంసారిక పారమార్థిక కార్యములను చక్కబెట్టును.

మధ్యాహ్నమాయెను. భగవత్పూజ గావించి భక్తరాజు భోజనమునకు కూర్చుండబోవు సమయమున, శ్రీరంగధరమెహతా పంపిన బ్రాహ్మణుడు వచ్చి పత్రిక నిచ్చెను. పత్రిక నిట్లు చదివెను.

"పరమస్నేహితుడైన భక్తరాజ శ్రీనరసింహరాముకు సప్రేమాభివందనములు. మీకుమార్తె యగు కుమారబాయి సీమంతము మాఘశుక్ల సప్తమీ ఆదివారమున నిశ్చయింపబడినది. కావున తమరు తమ ఇష్టమిత్రులతోడి వేంచేసి నా గృహశోభ నినుమడింపచేయ ప్రార్థన. ఇచట అందరును కుశలురే. అచట తమరు క్షేమమని తలచెదను.

తమ

శ్రీరంగధరరాయుడు."

నరసింహ మెహతా బ్రాహ్మణుని యథోచితముగ సత్కరించి మరునాడు పంపెను. భక్తరాజు తనలో ఇట్లు విచారింప దొడగెను. "నేటివరకు వ్యావహారిక కార్యములందును, నాజీవితమందును ఇది అంతిమ విషయము కావున యథాశక్తిగ నిచ్చి పుత్రికను సంతోషపెట్ట వలయును. కాని దీనికై నేను వ్యర్థముగ చింతింప పనియేమి? నాదేమి కలదు? భక్తవత్సలుడగు భగవానుడు నా అంతిమ విషయమును సిద్ధపరచగలడు."

భక్తరాజు ఒక సేవకుని విరిగిన ఎడ్లబండి నొకదానికి ముసలిఎడ్లనుగట్టి జూనాగఢ్ నుండి బయలుదేరెను. ఆతనితోడ ఇరువురుసాధువులును గలరు. అతనివద్దగల భగవంతునిప్రతిమ, కరతాళములు, గోపీచందనము మొదలగు పూజాద్రవ్యములు కూడ గలవు. ఏడెనిమిది దినములు భజనసల్పుచు వారు ఊనా చేరిరి. శ్రీరంగధరునిఇంట కడువైభవమున వేడుకలు జరుగుచుండెను. భక్తరాజు వచ్చిన సమాచారము విని ఆతని కలసికొనుటకు వచ్చెను. కుశలప్రశ్న లడిగి వసతి ఏర్పాటు చేసెను. నాగరికుల భక్తిపూజలను ఆటలక్రింద భావింతురు. మన భక్తరాజునకు పర్ణకుటీరము, రాజ భవనము రెండును సమానములే. ఆతడు స్నానముచేసి భగవంతుని ప్రతిమకు నియమానుసారముగ శ్రీకృష్ణకీర్తన చేయ దొడగెను. తండ్రిరాక విని కుమారబాయి చాలసంతసించి ఆతనిని చూచుటకై అచటకు వచ్చెను. కాని అచటి పరిస్థితి చూచి ఆమె నిరాశచెంది కన్నీరు కార్చెను. "అమ్మా! ఎందులకేడ్చు చున్నా"వని భక్తరాజడిగెను. "నాన్నగారు!

నాగరజాతి యంతయు నన్ను హేళనచేయుచున్నది. మీరీ సాధువులను తీసికొనివచ్చుటకు బదులు బంధువుల నెవరినైన దెచ్చినచో బాగుండెడిది.''

''అమ్మాయీ! నీవు వారిమాటలకు ఖిన్నురాలవ్యేద వేల? గంగ-పాపమును, చంద్రుడు-తాపమును, కల్పవృక్షము-దరిద్రమును నాశనము చేయును. కాని సజ్జనులు పాప, తాప దరిద్రముల మూడింటిని నశింపజేయుదురని నీకు తెలియదా? వీరలకు మించిన ఆత్మీయులింకెవరు గలరు? లౌకిక బంధువులు స్వార్థపరులుగ నుందురు. తమ స్వార్థము నెరవేరనిచో తల్లి, తండ్రి, సోదరులు, బంధువులు, అక్క-చెల్లెండ్రు పరాయివార గుదురు. కనుక ఇట్టి కల్యాణకారులగుసాధువులనువదలి స్వార్థ పరులగు బంధువులతోడి ఎట్లు సాంగత్యము చేయగలను?'' అని పల్కెను. ''సరే! తండ్రీ! సంఘముగొడవ వదలివేయుడు. మా అత్తమామలకు, ఆడుపడచుల కెట్టి వస్త్రములను తెచ్చినా''రని కుమారబాయి ఉత్సాహమున అడిగెను. ''అమ్మాయీ! నీ బీదతండ్రి ఏమియు చేయలేడని నీకు తెలియును. ఏదైన చేయగల్గిన ఆదీనదయాళువే చేయ గల''డని భక్తరాజు నిశ్చింతగ బల్కెను. ''నాన్నగారూ! రేపే సీమంతముహూర్తము. మీరు వెంట నేమియు తీసికొని రాలేదు. భగవంతు డెట్లీయగలడు? ఆత డెచట నుండునో కూడ నిశ్చయముగ తెలియ''దని కుమారబాయి అధైర్య ముగ బల్కెను. ''అమ్మాయీ! నీవెందులకింత కంగారు పడెదవు? నీ వా ప్రభువుదయను ప్రత్యక్షముగ చూచియే యున్నావుకదా. నీ సోదరుడైన శ్యామలదాసుని వివాహ

సమయమున ఆతడెంత శ్రమచేసెను? నీవు అత్తవారింటికి వెళ్ళినపుడు ఏర్పాట్లన్నియు ఆతడే స్వయముగ చేసి యున్నాడు. హృదయమున నీకీ శంక ఏలకల్గినది? ఆతడు జడ చేతనములందును ఆకాశ పాతాళము లందంతటను ఉన్నాడు. కాన నిశ్చింతగ నీ వింటికి పొమ్ము. భగవంతుడే సర్వముగ సమకూర్చును" అని భక్తరాజు కుమారబాయిని సమాధానపరచెను. స్వస్థచిత్తయై కుమారబాయి ఇంటికి పోయి గృహకార్యముల చేసికొనదొడగెను.

ఇచట నరసింహమెహతా భగవానునికి నైవేద్యమిడి సాధువులతోడి శ్రీరంగధరుని ఇంటికి చేరెను. అచట జాతివారందరును స్నానాదులుచేసి భోజనమునకు సిద్ధముగ నుండిరి. నరసింహరాంకూడ స్నానము చేయబోవుచుండెను. కాని నీరు చాలవేడిగ నుండెను. తెలిసియు ఆతనిని పరీక్షించవలెనని అంతటి వేడినీరు పెట్టిరని ఆతని కేమితెలియును? కొలది చన్నీరిమ్మని సరళముగ అడిగెను.

దీనిపై కుమారబాయి అత్తగారు "మీరు భగవంతుని ప్రియభక్తులుగదా? ఆకసమునుండి వర్షము కురిపించి భగవానునినుండి చన్నీటిని తెప్పించుకొను"డని పరిహాసముగ పల్కెను. అచటగల నాగరులందరును వ్యంగ్యమగు వేళాకోళమున "అవునవును, భక్తరాజున కిదియొక లెక్కయా?" అనిరి. భక్తుడు విచారమున మునిగెను. భోజనమున కెల్లరు సిద్ధముగ నుండిరి. వీరు చన్నీరు ఇవ్వరు. వర్షము కురియునంత వరకు అందరును భోజనము చేయకుండ నుందురు. సరే కానిమ్ము. భగవదేచ్ఛ ఎట్లున్న అటులే జరుగగలదని తలచి

తన కరతాళముల నడిగి మల్హార్ రాగమున కీర్తన చేయ నారంభించెను. "భగవంతుడా! నీవు సుధన్వుని మరుగుచున్న నూనె కడవను నీ కృపామృతముచేత శీతలము చేయలేదా? ఇదికూడ అట్టిపనియే ప్రభూ! నీ వనేకపర్యాయములు నాకు సహాయపడితివి. నేడీ ధర్మసంకటమునుండి దాటింపవా? హే శ్యామసుందరా! వెంటనే వర్షమును కురిపింపుము. ఈ పరిహాసకుల నోళ్ళు కట్టింపవా?" అని ప్రార్థించెను.

భజన సమాప్తి కాగానే మాఘమాసపు నిర్మలాకాశము నల్లటి మేఘములచే ఆవరింప బడెను. ఎల్లరు చూచుచుండగనే శ్రావణ భాద్రపద మాసములవలె కుంభవృష్టి కురిసెను. ఎల్లరు తడిసిరి. భగవత్కృపచే భక్తరాజుని ఉదకము చల్లనయ్యెను. వర్షము ముగిసెను. స్నానముచేసి భక్తరాజుకూడ ఆసనముపై భోజనమునకు కూర్చుండెను. ఆతని భక్తి గాంచి అందరును ఆశ్చర్య చకితులైరి. అయినను అందరికిని భగవానునిపై విశ్వాసము గలుగలేదు. దీనియందేదో గారడి గలదని తలచిరి.

మరునాటి ప్రాతఃకాలమునుండియే సీమంత సంస్కారమారంభమయ్యెను. శ్రీరంగధర మెహతా గృహము బ్రాహ్మణులు, బంధువులు, వృద్ధులు, బాలకులచే నిండియుండెను. మంగళ వాద్యములు మ్రోగుచుండెను. విధ్యుక్తవిధిని సీమంత సంస్కారము సమాప్తియయ్యెను. వియ్యాలవారికి వస్త్రములనిచ్చు సమయము వచ్చెను. వస్త్రముల నిచ్చు సమయము వచ్చినదని కుమారబాయి కన్నులతోడి జ్ఞాపకము చేయునటుల తండ్రివైపు చూచెను. భక్తరాజు సమయము

చూచి కరతాళముల గైకొని భజనసేయుచు భగవానునితో మొఱలిడ నారంభించెను "భక్తవత్సలా! నేను నీవాడను. నీవు నావాడవు. ఈ కడపటి వ్యావహారిక కార్యమందు నీవు సహాయపడవా? ప్రభూ!

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామ్యే తత్ వ్రతం మమ॥

వా. రా. 6_18_33.

'ఎవడు ఒక పర్యాయమైన నన్ను శరణుజొచ్చి నేను నీ వాడనని యాచించునో వానికి నేను సర్వభూతములనుండి అభయమిచ్చు చున్నాను. ఇదియే నా వ్రతము' అని నీ వొక ప్రతిజ్ఞకలదు." ఈ విధముగ భజనచేయుచు భక్తరాజు తన్మయుడయ్యెను. అచటగల స్త్రీలందరు భక్తరాజునుగూర్చి ఈ విధముగ తమలో చర్చించుచుండిరి. "ఈ బైరాగిచూడండి ఇదియేనా వస్త్రములిచ్చు పద్ధతి? ఈ విధముగ నాట్యగానములచే భగవానుడు బట్టలనిచ్చునా?" అని ఒకతె తలంచెను. వేరొకతె "నీకిదియైన తెలియదా? మనకు వచ్చునది ఆయనవద్దనున్న శంఖము, గోపీచందనమే." అని నవ్వుచు బల్కెను. ఇదివిని అందరును పక్కుననవ్విరి. కుమారబాయి లజ్జావమానములచే క్రుంగిపోయెను. భూమి బ్రద్దలయినచో దానిలోనికి పోవుదమా యని తలచినది. కాని ఆమె ఏమి మాట్లాడగలదు? ధర్మపరాయణురాలగు వృద్ధస్త్రీ అందరిని మందలించుచు, "భగవద్భక్తులను పరిహాసింపరాదు. అతడేమి లీలలు చూపించునో తెలియదు. భగవంతునిపై నిజమగు భక్తియున్నచో ఏదిజరుగదు? ద్రౌపదికి వలువలిచ్చిన

విషయము మీకు తెలియదా ? ” అనెను. ప్రపంచమున విమర్శకులకు లోటులేదు. తనకు తెలిసినను తెలియకున్నను తన బుద్ధినిబట్టి ప్రతివారిని విమర్శించును. విమర్శయను ప్రవాహము సాధకుడు అస్థిరమనస్కుడైనచో వానిని పడవేయును. భక్తరాజు ఇట్టి బాధలనన్నిటిని అధిగమించినాడు. ఆతని కితరుల విమర్శల వినుటకు అవకాశమెక్కడిది ? ఆతడు తన్మయుడై భగవానుని పిలుచుచుండెను. చివరికతని దీనాలాపములు సప్తలోకములను భేదించి భగవద్ధామము చేరెను. భక్తవత్సలుడగు భగవానుడు తక్షణమే భక్తుని కార్యనిర్వహణకై ఇంటికి బయలుదేరెను. భక్తరాజుని కీర్తన పూర్తి కాగానే మంగళగీతములు పాడుచు వస్త్రాభరణములచే అలంకరింపబడిన యువతులతోడి ఒక ధనికురూపమున భగవానుడు మంటపమున కేతెంచెను. ఈ రహస్యము నెవ్వరు గుర్తెరుగరైరి. చర్మచక్షువులచే యోగమాయా సమావృతుడగు భగవానుని నెవరు గాంచగలరు ? భక్తరాజు భగవానుని గుర్తించి ఆతని పాదములపై బడెను.

వర్తకవేషధారి అగు భగవానుడు తన పరిచయము చెప్పుకొనుచు “ శ్రీరంగధరజీ! నరసింహరాం నా కత్యంత మిత్రుడు. నేను ద్వారకలో ఈతని పేరిట వ్యాపారము చేయుచున్నాను. నా సంపత్తి యంతయు ఇతని కృపాఫల”మని శ్రీరంగధర్ మెహతాతో చెప్పెను. ఆతని చేతులతో బంధువుల కందరకు విలువగు వస్త్రముల నిచ్చెను. ఇవ్వవలసినదానికన్న మిన్నగ నొసగి ఎల్లరను సంతుష్టుల జేసెను. అచటగలవారందరు ఈ లీలనుగాంచి భక్తరాజుని

ఎంతయు కొనియాడిరి. భక్తరాజు గద్గదకంఠమున భగవాను నికి హృదయపూర్వక స్వాగత మొసగెను. శ్రీరంగధరుని పట్టు దలచే భగవానుడా దినమచట ఆతిథ్యము స్వీకరించి మరునా డచటనుండి శెలవుగైకొని అంతర్హితు డయ్యెను. భక్తరా జును సాధువులతోడి జూనాగఢ్ మరలివచ్చెను.

—*—

# ద్వేషమునకు ప్రతిక్రియ

మానవుని జీవితమున నేదైన విశేష సంఘటన జరిగిన నా ఖ్యాతి అంతటను వ్యాపించును. ఎంతటి రహస్య మయ జీవనమైనను ఎంతకాలము దాగగలదు? నరసింహ రాము సోదరునుండి విడివడినది మొదలు ఆతని జీవితము ప్రపంచదృష్టికి వింత యయ్యెను. ఉద్యోగమూ లేదు. రాత్రిం బవళ్ళు భజనలయందు మునిగి యుండును. బీదవానివలె వేషము. కాని సమయము కల్గినపుడాతడు చేయు వ్యయము చూచినగాని తెలియదు. గొప్ప గొప్ప ధనికుల ఇండ్లయందు గూడ ఆరీతిని కార్యములు జరుగవు. అసలు విషయమేమని ఎల్లరును ఆశ్చర్య పడుచుండిరి. కుమార్తె సీమంత సంస్కా రము పూర్తిగావించి మరలివచ్చినది మొదలాతని ఖ్యాతి మరింత వ్యాపింపజొచ్చినది. ఎల్లెడల నాతని చర్చయే జరుగుచుండెను.

కాని ఈర్ష్యాళువులగు ఆతని జాతివారికీర్తిని ఎట్లు సహింపగలరు? నరసింహరాముని ఘనతవిని అద్దానిని సర్వ నాశనము చేయ తలపసాగిరి. దుష్టుడు గొప్పవానితోడి సముడు

కానేరనిచో ఈర్ష్యచే ఆతనిని ఎదోఒక విధముగ వానిని క్రిందకు పడద్రోసి తన గొప్పతనమును రక్షింపజూచు కొను వ్యర్థయత్నము గావించును. కాని వీరలచే సత్పురుషుల కెట్టి హానియు కలుగబోదు. వారల ప్రతిష్ట మరింత వృద్ధిపొందును. దుర్జనులు తమ మూఢత్వమున నావిషయ మెరుగజాలరు.

నాగరజాతి వారందరును కలసి ఒకకుట్ర పన్నిరి. దానియందు సారంగధరుడు, నరసింహారాముని సోదరుడగు వంశీధరుడును కలరు. ఆగ్రామమునందలి ప్రసిద్ధిచెందిన సుందర వేశ్య నొకదానిని ధనాశజూపి భక్తరాజువద్దకు తన మోహపాశము వైవ పంపిరి.

సాయంసమయము. సంధ్యాకాలపు పూజ, హారతి పూర్తిగావించి సాధుమండలి మధ్య కూర్చుండి భక్తరాజు హరికీర్తనము చేయుచుండెను. పుష్పసువాసనలు, భగవత్సాన్నిధ్యము వలనను అచటి వాతావరణము పవిత్రము ఆనంద మయముగ నుండెను. సరిగ ఆదేసమయమున తెల్లని వస్త్రములదాల్చి గోపీచందనపు బొట్టుధరించి మెడను తులసిమాల వైచికొని వేశ్యయగు చంచల భక్తరాజింట జొచ్చెను. ఆ సమయమున భక్తురాలివలె ఆమె కన్పట్టుచుండెను. అచట గలవారికి నమస్కరించి ఒకమూల కూర్చుండి కలసి భగవద్భజన చేయుచుండెను. సాధువులు, భక్తరాజు మంత్రముగ్ధులై ఆమె తన్మయతను చూచుచుండిరి.

భజన పూర్తికాగానే భక్తరాజు చంచల తోడి "సోదరీ! నీ శుభనివాసమెక్కడ ?" యనెను. "నా నివాసము

ప్రభాసక్షేత్రము. నేను ద్వారకకుపోవు చున్నాను. తమ పేరు విని ఒక కార్యముకొరకై తమవద్దకు వచ్చితి'' నని చంచల అబద్ధమాడెను. ''నావద్దకు రావలసిన కార్యమేమి?'' అని భక్తరాజు విస్మయమున అడిగెను. ''నేనొక దానము గ్రహించుటకు వచ్చితి'' నని చంచల చెప్పెను. " సాధ్వీ! నీవు దానము గైకొనవలయునన్న ఎవరైన ధనవంతునికడకు పొమ్ము. నావద్ద ఈ కరతాళములు, మృదంగము, గోపీ చందనము తప్ప వేరేమియు లేవు'' అని భక్తరాజు సరళముగ బల్కెను. "భక్తరాజ! ఏవస్తువు నీవద్దనుండి గైకొనవలెనని తలంచితినో అయ్యది మరెవ్వరినుండి గైకొనను. తమకు నాపై దయగలిగిన నేను ధన్యురాల''నని చంచల వినయముగ పల్కెను. ''సరే! అయిన తెల్పుము. భగవంతుని దయ ఉన్నచో నీకు లభింపగల''దని భక్తరాజు తెల్పెను. ''మీ అజ్ఞయైనది. అంతియేచాలు. సమయము వచ్చినపుడడిగెద''నని చంచల పల్కెను. విషయవాసనలు గలవారికి ఎల్లరు తమవలె వాసనాలోలురవలె కాన్పింతురు. వారు పవిత్రులను గూడ విషయ లోలురుగ తలతురు. పవిత్రుల జ్ఞానయుత వాక్కులు కూడ విషయ యుక్తముగ తలచి వానికి వ్యతిరేకార్థ మొసంగి తమ అభీష్టము నెరవేర్ప తలంచుచుందురు. చంచల కూడ భక్తరాజు వాక్కుల కపార్థము కల్పించెను. భక్తరాజు తన రూపమునకు మోహితుడై తన్ననుసరించు చుండెనని తలచెను.

భజన పూర్తికాగనే ఎల్లరు తమతమ స్థానములందు శయనించిరి. చంచలకు కూడ పరుండుటకు భక్తరాజొక

చోటు చూపించెను. ఆతఁడు దేవాలయద్వారమున పరుండెను. ఎల్లరును గాఢనిద్రయందు మునిగియుండిరి. కాని చంచలకు నిద్ర ఎక్కడిది? ఆమె తన స్వార్థసాధనకు తగిన సమయము నకై నిరీక్షించు చుండెను. అర్థరాత్రి గడిచిన పిమ్మట, ఇక నెవ్వరును మేల్కొని యుండరని ఆమెకు విశ్వాసము కలుగ గనే, ఆమె సామాన్యవస్త్రములు వదలి సుందర వస్త్రాభరణ ముల దాల్చెను. ఆసమయమున అమె ముఖాకృతి శరీరసౌష్ట వముల జూచిన ఒక దేవాంగనవలె యొప్పుచున్నది. ఆమె తన ఆసనమువదలి భక్తరాజు వద్దకు వచ్చెను. ఆమె చరణ ముల నూపురధ్వని విని భక్తరాజు మేల్కాంచి "ఎవరది?" అని ప్రశ్నించెను. "మీతోడి భజనసల్పిన చంచల"నని సమా ధానము చెప్పెను. "అయిన ఇపుడిచట కేలవచ్చితి"వని భక్తరా జడిగెను. చంచల "నిన్న సాయంకాలము నేనడిగిన కోర్కె చొప్పున నీవద్ద నేడు ఋతుదానము గైకొన వచ్చినదానను. నేనింకేమియు కోర"నని పల్కెను. చంచలయొక్క ఈనిర్లజ్జ తను గాంచి నరసింహారాం స్తబ్ధుడయ్యెను. ఆయన నోట నుండి కేవలము "హరి హరీ!" యని మాత్రము వెడలెను. చంచల తిరిగి అధైర్యముతో "భక్తరాజా! మీరు నన్ను బాధించకుడు. వేగముగ నన్ను సంతుష్టపరచుడు" అని చంచల వేడెను.

"సాధ్వీ! నీవేమి బలుకుచున్నావు? నావద్దనుండి ఇట్టిది గ్రహించుటకా నీవు వచ్చితివి. సాధువేషము ధరించి ఇట్టి నీచవిచారణ మనమునందుంచుకొనినచో మనుష్యుడు పాపియై అధఃపతనము చెందును. మానవజీవితము పాపము చేయు

టకు కాదు, అక్షయమగు పుణ్యముసంపాదించుటకు. వ్యభిచారముకొరకు గాదు, సంయమముకొరకు. వాసనాతృప్తికి కాదు, శుద్ధసాత్విక ప్రేమ పొందుటకు. చరిత్రను సర్వనాశనము చేయుటకు కాదు, సచ్చరిత్రను సమకూర్చుటకు. అవిద్యను పొందుట మానవ జీవితలక్ష్యము కాదు. అవిద్యను నాశనము చేసి సద్విద్యను సేవించవలయును.

లబ్ధ్వా కథంచి న్నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనం।
యస్త్వాత్మముక్త్యై నయతేత మూఢధీః
స ఆత్మః స్వం వినిహంత్య సద్గ్రహాత్॥

పూర్వపుణ్య ప్రభావముచే ఈ దుర్లభమగు మానవ జన్మయు, అందునను పురుషజన్మ పొందియు ఏ మందభాగ్యుడు మోక్షమునకై యత్నింపడో వాడాత్మహత్య చేసికొనుచున్నవాడై అసత్యసంసారమున బడి స్వయముగా తనను నాశనము గావించుకొనుచున్నవాడు. సాధ్వీ! విషయలాలసయు, సాంసారిక విషయ వ్యాసంగమును, కీర్తి కామము, మొదలగునవి మనుష్యుని నరకమార్గమున బట్టించుచున్నవి. ఒకవేళ ఈ కోర్కెలు నెరవేరినప్పటికిని శాశ్వతసుఖముల పొందనేరడు. ఈ కోర్కెలను ప్రోత్సహించుట మూలమున ఇయ్యవి మరింత వృద్ధి పొందును. వయసు గడచి శరీరము వృద్ధాప్యము పొందినను తృష్ణ మాత్రము నశింపదు. ఈ కోర్కెలనెడు అగ్ని, విషయములనెడు కట్టెలచే చల్లారదు. భగ భగ మండుచు మనుష్యుని సమస్త సుఖశాంతుల నాశనము గావించి తిరిగి జనన మరణ మయమగు సంసారమున

పడద్రోయును. కాన కోర్కెలను నాశనము చేయుటయే మోక్షమునకు ప్రధానసాధనము. భోగానుభవనము వలన కోర్కెలు శాంతింపవు.

నజాతు కామః కామానా ముప భోగేన శామ్యతి
హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే. —మనుస్మృతి 2-94

అగ్నియందాజ్యము పోసిన అగ్ని విశేషముగ ప్రజ్వరిల్లినటుల కోర్కెలను తృప్తిపరచుటవలన అయ్యవి భయంకర రూపముదాల్చి మనుష్యుని సర్వనాశనము గావించును.

సంసారముకూడ ఒకవిధమగు మహారోగము. దానిని దూరముచేయుటకు భగవన్నామ మను దివ్యౌషధము ఉపకారకరమైనది. కాని ఆ యౌషధముతోకూడ విషయాదులనెడు అపథ్యము చేసిన నూతన రోగము లంకురించి మహారోగము నశించుట కష్టసాధ్యమగును. అంతేగాక విషయాసక్తి వృద్ధిపొంది భగవన్నామము సడలి ఈ మహారోగము భయంకర సన్నిపాత రోగము దాల్చును. ఈ జీవు డనేక జన్మలనుండి ఇంద్రియసుఖముల ననుభవించుచున్నాడు. కాని ఆతనికి లేశమాత్రమైన సంతృప్తిలేదు. కాన శాస్త్రకారులు ఈ ప్రపంచ మనిత్యమని సుఖరహితమని నిశ్చయించిరి. గీతయందు భగవానుడు—

"అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమాం" గీత 9-33

'ఈ అనిత్య సంసారమందుండి నన్ను భజింపు'మని తెల్పియున్నాడు. కేవలము ఆత్మచింతన, భజనలే నిజమగు సుఖకరములు. మూఢత్వమున విషయసుఖము లానందకరములుగ కన్పట్టు''నని భక్తరాజు తెల్పెను.

భక్తరాజుని ఈనీతి పల్కులచే చంచల హృదయము మారిపోయెను. ఆమె జన్మ జన్మాంతర సంస్కారముపైన ఇంద్రజాలమువలె పనిచేసెను. ఆమె హృదయపటలమునుండి చెడు సంస్కారములు తమంతట తామే అదృశ్యమైనవి. విషయవాసనలచే అపవిత్రమైన ఆమె తమోమయదేహము సత్సంగమను శరత్పూర్ణిమా సహవాసమున నిర్మల చంద్రుని వలె వికసించెను. ఆమె సౌందర్యమున సాత్త్విక శాంతి ప్రకాశించెను.

"భక్తరాజా! క్షమింపుడు. నేడు నన్ను గొప్ప అంధకారమునుండి వెల్గునకు తెచ్చిరి. నేటినుండి మీరే నాసద్గురువులు. మీ సదుపదేశము నా వికారములను నిర్మూలనము చేసినవి. కాని నేటివరకెన్నో పాపములు చేసినదానను. నా దుస్సాంగత్యమున అనేక యువకులు భ్రష్టులైరి. నేటి వరకు నేను చేసిన దుష్కృత్యములు తలచిన నాహృదయము కంపించిపోవుచున్నది. వీటిని తలచిన నాకు రౌరవ నరకమున గూడ స్థానముండదని తోచుచున్నది. తమరు నాకు సన్మార్గము చూపించి తగు శిక్షణ ఇవ్వ ప్రార్థించుచున్నా"నని గద్గదకంఠమున వేడుచు చంచల భక్తరాజు పాదములపై బడెను.

"అమ్మాయీ! అనేక పాపముల జేసినను మానవుడు నిజహృదయముతోడి పశ్చాత్తప్తుడైనచో ఆతడు ఆ పాపములనుండి విముక్తుడగును. భగవానుని అనన్యచింతన పతితుల పావనులుగ జేయును. భగవానుడు స్వయముగ ఇట్లు చెప్పియున్నాడు.

"అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితోహి సః॥

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥
భగవద్గీత 9-30, 31.

'బహు దురాచారియైనను అనన్యభావనచే నన్ను భజించు వాడు సాధువుగనే తలంపబడును. వేగముగా ధర్మాత్ముడై శాంతిని బొందును. అర్జునా! నాభక్తు డెన్నటికి నశింపడని తెలిసికొనుము.' కాన నీవు నీఇంటికిపోయి భగవంతుని అనన్య మనసుతోడి భజింపుము. నీకిదియే నిజమగు ఉపదేశము. గురువు కావలెనను ఇచ్ఛలేదు. నాకట్టి యోగ్యతలే"దని భక్తరాజు పల్కెను. చంచల భక్తరాజు ఆజ్ఞను శిరసా వహించి ఇంటికిపోయెను. ఆదినమునుండి ఆమె వేశ్యావృత్తి వదలి భగవద్భజన సాధుసేవలయందు నిరాడంబరముగ జీవితమును గడుపుచుండెను.

ఒకవారము దినములైనపిదప సారంగధరుడు చంచల ఇంటికిపోయెను. అచటి ఆమె వినూత్న జీవితము చూచి ఆత డాశ్చర్యపడెను. చంచల ఆసమయమున సాధువులతో గూడి భజన చేయుచుండెను. ఆమె ముఖముపై దివ్యతేజము తాండవమాడుచుండెను. "చంచలా! ఆవిషయ మేమైనది?" అని సారంగధరుడు ప్రశ్నించెను. "సారంగధరజీ! తమరు నిరపరాధుడగు భక్తరాజునియందు దోషారోపణ గావించిన పాపులగుదురు. ఇతరులను చెరపజూచిన తానే చెడునన్న విషయము గుర్తుకు తెచ్చుకొనుడు. మీ ద్వేష మాతని

నేమియు చేయలేదు. మీరు జాతికి అగ్రగణ్యులు, కర్ణధారులు అయి ఉండియు ఇతరుల ఉత్కర్ష సహింపనేరకుండుట నా కసహ్యము గొల్పుచున్నది. ఇంతకన్న నేను మీతోడి హెచ్చు మాట్లాడదలచ"నని చంచల భగవద్భజనయందు లీనమయ్యెను.

పరమాత్ముని లీల గొప్పది. చంచల చెంతనుండి వచ్చుచుండ మార్గమధ్యమున సారంగధరుని ఒక సర్పము కరచెను. నిమిషమున సర్పవిష మాతని రోమరోమమున వ్యాపించెను. అతడు మార్గమధ్యమున స్మృతితప్పిపడిపోయెను. చాలమంది ప్రోగై ఉపచర్యలు చేసిరిగాని విషము తగ్గలేదు. బంధువులు నిరాశచెంది ఏడ్వనారంభించిరి. చివరికి ఒక నాగరుడు "సోదరులారా! ఒక్క ఉపాయమున్నది. అదికూడ చేసి చూడుడు. నరసింహరాం ఇపుడొక మాంత్రికుడైనాడు. బహుశః ఆతడు సారంగధరుని స్పృశించిన విషము దిగిపోగలదు" అనెను. అందరును అంగీకరించి సారంగధరుని భక్తరాజుని ఇంటికి తీసికొనివచ్చిరి. భక్తరాజునితో విషయమంత ఎరింగించిరి. భక్తరాజు "సోదరులారా! నాకే మంత్రతంత్రములు తెలియవు. భగవత్కృపచే ఆతని చరణతీర్థముచే మృత్యుభయము తొలగగలదు" అని పల్కి భగవంతుని స్మరించి తీర్థము తెచ్చి సారంగధరుని ముఖముపై చల్లెను. భగవత్కృపచే సారంగధరుని విషము దిగి సచేతుడై లేచి కూర్చుండెను. కాని అతడు ఎదుట నరసింహరాముని చూడగనే లోలోన క్రోధమున మండిపడెను. అచటనుండి లేచి మాటలాడక ఇంటికిపోయెను.

ఈవిధముగ భక్తరాజు ద్వేషమునకు బదులు ప్రేమ చూపి తన ఆదర్శమగు విశ్వప్రేమను ప్రజల ఎదుట ప్రదర్శించెను.

—*—

## భక్తరాజుని పరీక్ష

పాముకు పాలుపోసినను విషము పెరుగును. భక్తరాజు దయాళుడై సారంగధరుని బ్రతికించినను అది విరుద్ధమాయెను. నరసింహారాము ఒక గారడియనియు ఇదెల్ల ఆతని దుష్టస్వభావ ఫలితమని ఆతడు తలచెను. కనుకనే భక్తరాజునిన ఆతనికి ద్వేషాగ్ని మరింత హెచ్చెను. ఆకాలమున జునాగఢ్‌ను రావుమాండలిక్ అను క్షత్రియరాజేలుచుండెను. సారంగధరుడాసమయమున ఒక ఉన్నతోద్యోగిగ నుండెను. సారంగధరుని యత్నము చంచలద్వారా విఫలమైనపిదప ఆతడు రాజువద్ద నరసింహారాముని నిందింప దొడంగెను. కాని రాజు ఆతనిమాటల లెక్కింపలేదు.

సారంగధరుడు మొండిపట్టుదల కలవాడు. భక్తరాజునకు మరణదండనగాని లేక కారాగారమైన విధింపబడినగాని ఆతడు నిదురింపలేడు. రాజాతని మాటలు లెక్కింపకున్నను భక్తరాజునిగూర్చి ఏవేవో ఆతడు చెప్పుచునే యుండెడివాడు. తుదకొకనాడు సారంగధరుడు రాజుతోడి భజనయను మిషపై భక్తరాజు అనాచారములు చేయుచున్నాడనికూడ చెప్పెను. అట్టిమోసగాని దండించుట ఎంతో అవసరమట.

గొప్పవారలకు చెవులుండును గాని, కన్నులుండవం దురు. ప్రతిదినమాతనిపై నిందలు వినుటచే ఒకదినము రాజు భక్తరాజుని రాజసభకు పిలిపించెను. మరుసటిదినము న్యాయ విచారణకై నిశ్చయింపబడెను. ఆ దినము భక్తరాజు భగవత్పూజ చేసికొని నామజపముచేయుచుండ ఒక వృద్ధబ్రాహ్మణు డచటికి వచ్చెను. ఆతని కర్ఘ్యపాద్యాదులొసంగి వినయముగ ఆతని రాకకు కారణమడిగెను.

"భక్తరాజా! వృద్ధాప్యమున ధనార్జన పొసగుటలేదు. కాన నా కుమార్తె వివాహయోగ్యురాలైనను వివాహముచేయ అసమర్థుడనైనాను. తా మొక అరువదిరూప్యము లొసగిన మీకు చాలశుభము చేకూరగల"దని పల్కెను. "స్వామీ! నా వద్ద ధనమేమియు లేదు. కాని ఒకింత సేపు కూర్చొనుడు. నేను ప్రయత్నించెదను. ఈశ్వరకృప కల్గిన తమకార్యము నెరవేరగల"దని భక్తరాజు సమాధాన మిచ్చెను.

నరసింహరామాతనిని కూర్చుండబెట్టి అంగడికిపోయి తన పరిచితులవద్ద ఒక అరువదిరూప్యములు ఋణ మడిగెను. కాని ఇచ్చుట కెవ్వరును అంగీకరింపరైరి. తిరిగి ఆతడెట్లు చెల్లింపగలడా యని అందరును భయమొందిరి. చివరికి నరసింహరాము ధరణీధరుడను నాగరుని ఇంటికి పోయెను. ఆతడు భక్తుడు. నరసింహరామునిపై ఆతనికి శ్రద్ధయు అధికము. కాని ఆతడు స్పష్టవాది. నరసింహరాము తన పరిస్థితి అంతయు చెప్పినమీదట ఆతడు "ఆహారే వ్యవహారేచ స్పష్టవక్తా సుఖీభవేత్" అను న్యాయానుసారముగ, "నరసింహ రాంజీ! మీకు ధనమిచ్చుటకు నా కెట్టి అభ్యంతరమును లేదు.

కాని డబ్బువిషయము చాలచిక్కైనది. కేవలము మాటపై విశ్వాస ముంచుటకన్న ఏదైన వస్తువొకటి తాకట్టుగ నుంచుట మంచిది. మీరేదైన వస్తువు తెచ్చినచో నే నిపుడే అరువది రూప్యము లివ్వగల''నని స్పష్టముగ తెల్పెను.

''నావద్ద తాకట్టు పెట్టుటకు తగిన వస్తు వేమిగల''దని నరసింహరాము డాలోచింప దొడగెను. బ్రాహ్మణుని పని ఎట్లు జరుగగలదు? క్షణమాలోచింపగనే ఒక ఉపాయము తట్టెను. ''నావద్ద అన్నిటికంటె ప్రియమైనది కేదారరాగ మున్నది. నేనీ రాగముననే భగవానుని పిలుచుచుందును. ఈ రాగము లేకున్న నాకు క్షణమైన జరుగదు. ఇది నా కమూల్యమైనది. ఇది ధరణీధరుడు తనవద్ద ఉంచుకొనినచో బ్రాహ్మణుని నిమిత్తమై దీనినికూడ తాకట్టు పెట్టెదను'' అని తలచెను.

''ధరణీధరా! నావద్ద తాకట్టుపెట్టుటకు యోగ్యమైన దేదియులేదు. నమ్మకమున్నచో కేదారరాగము మీవద్ద పెట్టెదను. మీడబ్బు తీర్చుకొను నంతవరకు నాప్రాణములు పోయినను నేను కేదారరాగము పాడను.''

కేదారరాగము భక్తరాజునకెంత ఆవశ్యకమో ధరణీధరునకు తెలియును. అత డంగీకరించెను. భక్తరాజు అతనికి ఈ ఆశయముతోడ అతనికి పత్రము వ్రాసి ఇచ్చెను. ''భగవంతునిపై ప్రమాణముచేసి, ధరణీధరునకు అరువదిరూప్యములు చెల్లించనంతవరకు నేను కేదార రాగము పాడనని వాగ్దానము చేయుచున్నాను.'' ఈప్రతిజ్ఞా పత్రము గైకొని ధరణీధరుడు భక్తరాజునకు ధనమిచ్చెను. భక్తరాజు సంతో

షమున గైకొని ఇంటికిపోయి బ్రాహ్మణున కా ధనమిచ్చెను. బ్రాహ్మణుడు కృతజ్ఞతాపూర్వకముగ దీవించి అచటనుండి వెడలిపోయెను.

—*—

# దర్బారు నందలి భక్తరాజు

మరునాడు భక్తరాజు రావుమాండలీక్ రాజుయొక్క దర్బారులో హాజరాయెను. చెట్టును నరకుటకు గొడ్డలికి చెట్టు కఱ్ఱయే అధారమైనట్లు నరసింహమెహతాను అవమానపరచుటకు వంశీధరుడు, సారంగధరుడు, అనంతరాయడు మొదలగు స్వబంధువులు సిద్ధముగ నుండిరి. భక్తరాజు జ్ఞానహీనుడని ధృవపరచుటకు సారంగధరుడు తనతోకూడ ధనమునకు అమ్ముడువోయిన ఇరువురు సన్న్యాసులను వెంట తెచ్చెను. ఎల్లరును యథాస్థానములయం దాసీనులైన పిదప రాజు సారంగధరునివైపు జూచి "మీరు చెప్పదలచినది చెప్పు" డనెను. "రాజా! ఈ నరసింహరాం మన పట్టణమందుండి పలుపన్నాగములు పన్ని ప్రజల మోసగించు చున్నాడు. భక్తిపేరిట అనేక అనాచారములు గావించుచున్నాడు. తాను అజ్ఞానియైనను జ్ఞానముపదేశింతునని ధర్మశాస్త్ర విరుద్ధకార్యములు సల్పుచున్నాడు. ఇట్టి అధర్మప్రచారమునకు తగిన రీతిని శిక్షించి దేశము నధర్మమునుండి కాపాడుట రాజధర్మ" మని సారంగధరుడు పల్కెను.

"సారంగధరా! నేను చాల దినములనుండి భక్తరాజుని కీర్తి వినుచున్నాను. ఆతడు కృష్ణ భక్తుడు. ఆతడు

పుట్టిన నాటనుండి నేటివరకిట్టి కళంకమును కల్గియుండలేదు. తిరిగి నేడీవృద్ధాప్యమున ఇట్టి దుష్ప్రవృత్తి కల్గెననుట అసంభవము. ఇట్టి వీతరాగులగు మహాత్ములు భగవద్భక్తి ద్వారా సంసారమును సన్మార్గమున పట్టించగలరు. వారి ఆచరణయే ఒక ధర్మశాస్త్రము. మీధర్మశాస్త్రముకూడ ఇట్టి మహాత్ముల అనుభవము, ఆచరణ ఉపదేశము లేగదా! కాన వీరి ఆచరణ ధర్మశాస్త్ర విరుద్ధమని తోచదు. సరే. ఇక అనాచార విషయమనిన ఏదైన విశ్వసనీయమగు సాక్ష్యము లభించునంతవరకు అనాచారియనుట పాపము" అని రాజు పల్కెను.

ఈ దేసమయమున అనంతరాయుడు మాట్లాడజొచ్చెను. "స్వామీ! మీరు అనన్యభక్తుల విషయమై చెప్పినదెల్ల యథార్థమే. అగుట కీతడు నా మేనల్లుడే కాని భజనయను మిషపై అనాచారముల గావించుచున్నాడను వాస్తవ విషయమును తెల్పుటకు నాకు సంకోచము లేదు. ఈ విషయమున నాకుగల ప్రత్యక్షానుభవమొకటి విన్నవించుకొను చున్నాను. నా భార్యకూడ అనుదిన మీతని భజనలకు పోవుచుండెడిది. ఆమె నిత్యము భజనలో అర్థరాత్రి ఈతనికి మంచినీరు త్రాగించెడిది. ఈ విషయము సారంగధరుడు నాకెన్నియోమారులు తెల్పినను నేను నమ్మలేదు. ఒకనాడు స్వయముగ నామె నీరుద్రావించుట చూచినపిమ్మట ఆమెను భజనకుపోనీయలేదు. కాని నామాటవినక ఆమె మరల పోయినది. మరునాడు ఆమెను ఒకగదిలో బంధించి, దాని తాళపుచెవిని నావద్ద యుంచుకొంటిని. భజనమధ్యమున నీతడు ఇతరుల హస్తముల నుండి నీరు గ్రోలడని వినియుంటిని. నేనా రాత్రి ఈతని పట్టు

దల ఎట్టిదియో ఎరుంగుటకు వెళ్ళితిని. * కాని భజనమధ్యలో విశ్రాంతిసమయమున నా భార్య తనస్వహస్తముల నీరుద్రావించుట స్వయముగ చూచితిని. ఈ దృశ్యముచూచిన నాకు ఒడలుమండినది. ఆమెను ఎవరు వెలుపలకు తీసిరాయని ఆ క్షణమే ఇంటికిపోయిచూచుసరికి అయ్యది యథారీతిగ తాళము వేసియున్నది. ఆమె అదేస్థితిని రాధాకృష్ణనామము జపించుచు మైమరచి యున్నది. నాకు చాల ఆశ్చర్యమువైచినది. విషయమేమియో నా కర్థము కాలేదు. ఈవిధముగనే నరసింహరాము తన మాయాబలమున అనేకస్త్రీలను ఆకర్షించి వారలతోడి స్వేచ్ఛావిహారముల గావించుచున్నాడని నేను నిశ్చయించుకొంటిని. మీరు విశ్వసించినచో నగరమునగల చంచల వేశ్యను చూచిరండు. ఆమెకూడ ఈతనివలలో చిక్కి విచిత్ర వేషముల ధరించి నిత్యమీతని వద్దకు వచ్చుచుండును. ఇది యెల్లరెరిగిన విషయమే. రాజా! ఎవడైన ఏకాంతముగ రాత్రులయందు వేశ్యతోనుండియు పవిత్రుడుగ నుండగలడా? కాటుక కొట్టులో తెల్లని బట్టధరించి మచ్చలులేకుండ ఉండగలడా? నేను చెప్పినవిషయము నిజమో అబద్ధమో తాము స్వయముగ విచారించి తెలిసికొనవచ్చును.''

అనంతరాయని ప్రమాణ వచనములు విని రాజు చాల చింతాక్రాంతుడయ్యెను. "చంచల వేశ్య. భక్తరాజు చెంత

* అనంతరాయుని భార్య బందీయైనందున ఆదినము స్వయముగ భగవానుడే ఆరూపము దాల్చి భక్తరాజునకు నీరు త్రావించెనని చెప్పుదురు. ఈ రహస్యము తెలిసికొనజాలనందున అనంతరాయుడు, సారంగధరుడు భక్తరాజుని అనాచారిగ భావించిరి.

కనుదినము పోయి వచ్చుచున్నదను విషయ మెల్లరెరిగినదే. అనంతరాయడు దేవునిపై ప్రమాణముచేసి తన అనుభవము లను తెల్పుచున్నాడు. తన గృహవిషయమునుగూర్చి ప్రతిష్ఠ గల కుటుంబీకు డెవ్వడును అబద్ధములు పల్కడు. ఈవిషయ మును నిర్ణయించుటెట్లు? సరే. నరసింహరామునికూడ అడిగి జూచిన ఈపల్కుల కేమి సమాధానమిచ్చునో చూచెదను. ఇరుపక్షములవారి మాటలు వినుట ఆవశ్యక''మని తలచి ''భక్తరాజా! నీవు చెప్పదలచిన దేదియో తెల్పు''మనెను.

''రాజా! అనంతరాయడు తెల్పినదెల్ల యథార్థమే. కాని ఎవరినిగాని భజనకు రమ్మని బలవంత పరచుటలేదు. నాఇంటికి వచ్చి భగవద్భజన చేయుటకు ఆబాల వృద్ధులు, స్త్రీ పురుషులకు సమానమైన అధికారమున్నది. దీనియందు నాదోషమేదియు లేదు. నేను రాధాకృష్ణ నామముతప్ప వే రెద్దియు నెరుగను. నావద్దకు వచ్చి భజన చేయదలచినవారిని వారించి వారి మనసులకు బాధకల్గించుట భగవానునికి అప చారము కల్గించుటకు సమానమని భావింతును. తమరు ప్రభు వులు. దైవాంశ తమయందుగూడ గలదు. తాము నే నీ విష యమున దోషినో నిర్దోషినో స్వయముగ విచారించుడు. నాలో దోషమున్న నన్ను శిక్షింపవచ్చు'' నని భక్తరాజు సరళముగ విన్నవించెను.

మహాత్ముల హృదయములు కోమలములు. దయా పూరితములు. తాము స్వయముగ ఆపదల మున్గినను వారి నోటితోడి అపరాధులను అపరాధులని పేర్కొనరు. వీరెల్లరు

ఈర్ష్యచే ఈకుట్ర పన్నిరని భక్తరాజునకు తెలియును. అయి నను వారల దోషమును భక్తరాజు బయల్పెట్టలేదు.

భక్తరాజు తెల్పినమాటలు సారంగధరుడు సహింప లేకపోయెను. ఆతడు వెంటనే లేచి "నరసింహారాం! నీవు చాల అనర్థము గావించుచున్నావు. నీకు శాస్త్రజ్ఞానము లేకున్నను ఉపదేశికుడగుదునని తలంచుచున్నావు. నీకు ఉప దేశము చేయు అధికారమున్నచో ఈ సన్న్యాసులతోడి శాస్త్రార్థముచేసి ఈసభలో నీ సర్వజ్ఞత్వము నిరూపించు కొనుము."

"సోదరా! నేను శాస్త్రజ్ఞుడను కాను. సర్వజ్ఞుడను కాను. పరమాత్మవినా ఈ జగత్తున సర్వజ్ఞు తెవ్వరును లేరు. నేను శాస్త్రార్థముగాని వేదార్థముగాని చేయుట కసమర్థుడను.

"కామ క్రోధ మద మోహ కో జబ లగి ఘట మేఁ సాక్
క్యా పండిత క్యా మూర్ఖ దోనోం ఏక్ సమాక్."

(కామ క్రోధ మద మోహములు శరీరమున నున్నంత వరకు పండితులు మూర్ఖులు సమానులే)

శాస్త్రములను చదివి వాద వివాదములు సల్పుచు కామ క్రోధాదులకు వశుడై, ఆ శాస్త్రములను దుర్వినియో గము చేయువానిని పండితు డనువాడుకూడ మూర్ఖుడే. కాన మొదటినుండి నాకు పండితు డనిపించుకొనుట అయి ష్టము. నేను కేవలము ఆత్మచింతన భగవన్నామము మాత్ర మెరుగుదును. భగవచ్చింతనద్వారా ఆత్మను గుర్తించనంత వరకు యజ్ఞ తప వ్రతములగు సాధనములుకూడ ఉపయుక్త మగు ఫలము నియ్యజాలవు. వినుడు.

## —♦ ప్రభాతీ ♦—

జ్యాం లగీ ఆత్మాతత్వ చిన్యో నహీ త్యాం లగీ సాధనా సర్వఝూఠీ,
మానుష దేహతారో ఎమ ఎళగయో మావఠానీ జేమవృష్టి బూఠీ॥ 1

శుం థయుం స్నాన సేవాని పూజాథకీ శుం థయుం గేర రహిదానదీధే।
శుం థయుం ధరి జటాభస్మలేపనకరియే శుం థయుం లాలలోచన కీధే॥2

శుం థయుం తపనే తీరథకీ దాథకీ శుం థయుం మాలగ్రహీనామ లీధే।
శుం థయుం తిలకనే తులసీ ధార్యా థకీ శుం థయుం గంగజలపాన కీధే॥

శుం థయుం వేద వ్యాకరణ వాణీ వదే శుం థయుం రాయ నేరంకజాణే।
శుం థయుం దేవదర్శన సేవాథకీ శుం థయుం వరణ నభేద ఆణే॥ 4

యేఛే పరపంచ సహుపేట భరవాతణా ఆత్మ పరబ్రహ్మజేణేనజోయో।
భణే నరసంయ్యోకే తత్వదర్శన బినా రత్నచింతామణి జన్మఖోయో॥ 5

ఓ మనసా! ఆత్మతత్వము పూర్తిగ ఎరుగనంతవరకు సాధనలన్నియు వ్యర్థములు. నీ మానవదేహముకూడ శరదృతు వర్షమువలె వ్యర్థము.

స్నానము, సేవ, పూజ, దానముల వలనను, భస్మముల పూసికొని నేత్రముల నెర్రబారగ చేసిన నేమిలాభము?

తపము, తీర్థసేవనము జపములు, తిలకమాలలు ధరించుటవలన గంగాజలపానము చేయుటవలన నేమి లాభము?

వేదవ్యాకరణములు నేర్చుటవలన రాజు పేదల భేదము తెరిగినందువలన, దేవదర్శనము, పూజచేయుటవలన, వర్ణభేదము తెలియుటవలన ఏమిలాభము? ఇదంతయు పొట్టనింపుటకొరకేగాని పరబ్రహ్మస్వరూపమగు ఆత్మచింతన కలుగబోదు. కావున ఆత్మదర్శనము చేయనిచో చింతామణిసదృశమగు ఈ మానవదేహమును వ్యర్థముగ పోగొట్టుకొంటి

వని నరసింహరాం పల్కుచున్నాడు. కాన సోదరులారా! ఈ అనవసరమగు జంఝాటమున నేల తగుల్కొనెదరు? పొట్టకై చింతగలవారికే శాస్త్రార్థములు కావలెను. నాకు భోజనము లేకున్నను సరే చింతపడను" అని భక్తరాజు పండిత అపండితుల వివేచించి ఆత్మతత్వమహిమను స్పష్టీకరించెను.

భక్తరాజుని ఈ నిర్భీక వచనములు విని ఎల్లరును స్తబ్ధులైరి. పూర్తిగ పరీక్షించక భక్తరాజును దోషియనిగాని నిర్దోషియనిగాని తెల్పుట న్యాయవిరుద్ధము. నిరపరాధిని దండింపకుండునట్లును, అన్యపక్షములవారికి సంతోషముకలుగునట్లుగ ఏదైన ఒక ఉపాయ మాలోచించవలెనని తలంచుచుండ రాజునకు ఒక ఉపాయము తట్టెను. ఆతడొక పుష్పహారమును చేతిలోనుంచుకొని "భక్తరాజా! నీవు చెప్పినదెల్ల సత్యము. అయినను, నీకు విరుద్ధముగ వీరు సాక్ష్యమిచ్చుటచే సత్యాసత్యములను నిర్ణయించుట కఠినమైనది. కాన నేనొక ఉపాయ మాలోచించితిని. దానివలన న్యాయము జరుగవలయును. మరల ఇరుపక్షములవారు నిందించుకొనకుండ ఉండవలయును. మీ రీ పుష్పహారమును గైకొని రాజమందిరమునకు పోయి రాధామాధవుని కంఠమున సమర్పింపుడు. నేను స్వయముగా మందిరమునకు తాళమువైచి తాళపుచెవి నావద్ద ఉంచుకొనెదను. ప్రాతఃకాలమునకు పూర్వమే స్వయముగా భగవానుడు ప్రత్యక్షమై ఇదేహారమును మీ మెడలోవైచినచో నీ నిర్దోషిత్వము ధృవపడగలదు. అట్లు కానిచో తగు రీతిని దండింపబడగలవు" అని పల్కెను. రాజు తెల్పిన ఈ

మాటలు విని భ_క్తరాజు సంతోషముతో “న్యాయప్రియ రాజా! నీతిజ్ఞుడా! భగవానుడు భ_క్తవత్సలుడు. నేను నిజమగు నిష్కామ భక్తుడనైనచో ఆత డవశ్యముగ తన కంఠ హారమును నాకిచ్చును. అట్లు కాకున్నను సరియే. నాకు రాజమహాలు, కారాగృహమును రెండును సమానమే. భగవత్కీర్తన సల్పుట కేదైన నొక స్థావము లభించిన చాలును.”

భ_క్తరాజు రాజు చేతినుండి పుష్పహారము గైకొని రాజమహాలునందలి మందిరములోనికి వెడలి రాధామాధవుని గళమున హారమువైచి భక్తిపూర్వకముగ ప్రణమిల్లి వెలుపలికి వచ్చెను. రాజు మందిరమునకు తాళమువైచి తాళపు చెవులను తనవద్ద ఉంచుకొనెను.

సారంగధరుడు తన అధికారమును ప్రదర్శించుచు “నరసింహారాం! నీ వీ న్యాయమున ఓడినచో రాజుగారి ఖడ్గమున నీ శిరస్సు ఖండింపబడు”నని పల్కెను.

“సోదరా! రాజుగారి హస్తములతో ప్రభుమందిరమున నా స్వామియెదుట నాకు మృత్యువు కల్గినచో అంతకన్న మించిన సౌభాగ్యము వేరొకటేమున్నది? ఆత్మను ఎవ్వరును నశింపచేయలేరు. ఈ నశించు దేహము పోవునను బాధ, దుఃఖము నాకులేదు. ఏలయన సత్యమునకై చేసిన దేహత్యాగము నన్నమరునిగ జేయు”నని భ_క్తరాజు తెల్పెను.

ఇట్లు పల్కి భ_క్తరాజు మందిరపు వాకిలిపై కూర్చుండి భజన చేయుచుండెను. అన్నిపక్షములవారితో భ_క్తరాజు న్యాయవిచారణకై రాజు కూర్చుండెను.

---

## హారదానము

నిలువచేసిన ధనము సమయమున కక్కరకు రాక పోవచ్చును. విద్య, యౌవనము, జీవనములుకూడ చంచలము లగుటచే కాలకర్మము ననుసరించి నశించును. కాని భగవద్భజన కాలాంతరమునందును నశించదు. దాని ఫలమీం జన్మమందు కాకున్నను జన్మాంతరమం దధికముగ లభించును. వ్యర్థము కాదు. భక్తరాజీవిశ్వాసమును మనమునందుంచుకొని భగవద్భజన చేయుచుండెను. కాని తన ప్రియమగు కేదార రాగము అరువది రూప్యములకు బంధింపబడినదన్న విషయము హృదయమున నాతని వేధించుచుండెను. అది లేకున్న భగవానుని నెట్లు ఆవాహనము చేయగలడు? ఆతడు భగవ ధ్యానము చేయుట కెంత ప్రయత్నించినను ఆవిషయమై ఆతని మనసు వ్యాకులపడుచునే యుండెను.

* * *

వైకుంఠమున శ్రీకృష్ణ భగవానుడు నిదురించుచుండ జగన్మాతయగు శ్రీలక్ష్మి ఆతని పాదసేవ చేయుచుండెను. అర్థరాత్రి భగవానుడు మేల్కాని ఎచటికో వెళ్ళబోవు యత్నము చూచి లక్ష్మీసహితముగ అనుచరులెల్లర కాశ్చర్యము కల్గెను.

లక్ష్మీదేవి మందహాసమున “ప్రాణేశా! నేడకస్మాత్తుగ నిద్రాభంగమేల కల్గినది? ఏదైన దైత్యవధ కుద్యుక్తులగు చున్నారా? లేక ఏపశుభక్తుడగు గజేంద్రుని ఉద్ధరించవలయునా?” అనెను.

"మీకారహస్య మేమి తెలియును? నన్ను శరణు జొచ్చిన సర్వజీవులు నాకు సమానమగు ప్రియులు. పశువులు కానిమ్ము, దేవతలు కానిమ్ము, నరులు కానిమ్ము. కాని నేడొక పరమప్రియుడగు భక్తునకు సహాయముచేయ బోవుచున్నాను. ఆనిరపరాధియగు భక్తరాజునకు..." అని పల్కుచునే మాధవుడు బయల్వెడలిపోయెను. భక్తవత్సలుడగు భగవానుడు గరుడునిగాని అనుచరులనుగాని వెంటతీసికొనిపోలేదు. భక్తరాజు దీనాలాప మాతని హృదయమున బాధించుచుండెను. ఆతడు వెంటనే జునాగఢ్ వచ్చి భక్తరాజురూపము ధరించి ధరణీధరుని ఇంటికివచ్చి ఆతని తలుపు తట్టెను. నిదురించుచున్న ధరణీధరు "డెవ్వరని" ప్రశ్నించెను. "తలుపు తెరవుడు, నేను నరసింహరాముడను. ఋణవిముక్తుడ నగుటకు వచ్చితి" నని భక్తరాజురూపుడగు భగవానుడు పల్కెను.

భక్తరాజుని కంఠధ్వనివిని ధరణీధరునిభార్య తలుపు తెరచెను. భక్తరాజరూపియగు భగవానునిచూచి ధరణీధరుడు నమస్కరించి "భక్తరాజా! ఇంతతొందరేల? ఈ అర్థరాత్రి వచ్చుటేల? ఇంక కొలదిదినములు మీ వద్ద ధనమున్నను ఏమి ఆటంక"మని పల్కెను. "సోదరా! నిజమే కాని ఒక ఉదారగృహస్థునివద్ద ధనముదొరకిన అది ఇంట నుంచుకొనిన లాభమేమి? నా కిపుడే కేదారరాగము పాడుట కాలస్యమగుచున్నది. కాన ధనమిచ్చి రాగమును విడిపించి తెచ్చుకొనవలయునని తలచితిని" అని నరసింహరూపము దాల్చిన భగవానుడు తెల్పెను.

అట్లు పల్కి ధరణీధరుని ఎదుట అరువదిరూప్యముల నుంచెను. ధరణీధరుడు ధనము లెక్కించుకొని నరసింహారాముని పత్రముపై చెల్లుబడి వ్రాసి సంతకము చేసి భగవానుని కిచ్చెను. ప్రతిజ్ఞాపత్రముగైకొని భగవానుడు, వ్యథితహృదయుడగు భక్తరాజు ఏకాగ్రతతో భగవద్భజన చేయుచున్న రాజమహాలులోని మందిరమునకువచ్చి అంతరిక్షమునుండి ఆ పత్రమును భక్తరాజు ఎదుట పడవైచెను. ఈ విషయము భక్తరాజుతప్ప వేరెవ్వరు గమనించలేదు. భక్తరాజు ఉత్తరమును గ్రహించి ఇది తన ప్రతిజ్ఞాపత్రమేనని చాల ఆశ్చర్యపడెను. దానిపై నూతనాక్షరములు చదివెను. అందిట్లు వ్రాయబడియుండెను. "నేటి అర్ధరాత్రిమేల్కొల్పి నరసింహారాం నా కరువదిరూప్యములు చెల్లించెను గనుక నేను ముట్టినట్లు సంతకముచేసితిని. ఇపుడాతడు తన కేదారరాగమును ప్రేమతో పాడుకొనగలడు.

ఇట్లు,
ధరణీధరరాయడు."

పత్రమును చదువుచుండ భక్తరాజుని నేత్రములనుండి ప్రేమాశ్రువులు రాలజొచ్చెను. గద్గదకంఠుడై రోమాంచలితుడై, ఇయ్యది భగవత్కార్యమేనని ఆతడు తలచెను. ప్రేమయందున్మత్తుడై నాట్యము చేయుచుండెను. ఈ స్థితి చూచినవారెల్లరు పలువిధముల తలచుచుండిరి. "ఇపుడు తన బండారము బయటపడునను భ్రమతో వికారచేష్టలు చేయుచున్నా"డని అనంతరాయడు పల్కెను. "ప్రాతఃకాలము కాగానే రాజుగారి ఖడ్గముతోడ ఈ పిచ్చి వదలిపోవు"నని సారంగధరుడు చెప్పెను.

కాని భక్తరాజునకు ఈ మాటలతో నిమిత్తమేమి? ఆతని మనస్సులో అనాయాచితముగ ప్రతిజ్ఞాపత్రము లభించుటచే ఆతని హృదయమునందు అనన్యప్రేమ ఉప్పొంగుచుండెను. భగవంతుని హృదయమున నావంటి క్షుద్రజీవునకు కూడ స్థానమున్నదను ఆలోచన ఆతనిని ఉన్మత్తునిగ చేసెను. ఆతడా ప్రేమావేశమున మైమరచెను. తెల్లవారుటకు ఇంక కొలదిక్షణములు మాత్రమే మిగిలియున్నవని ఆతనికి తెలియనే తెలియదు.

"భక్తరాజా! నీ పిచ్చివలన తెల్లవారిపోవుచున్నది. ఇపుడీ అంతిమఘడియలలో నీ కంఠమున హారముపడనిచో నీ నాట్యము నిను రక్షింపదు. ఈ పిచ్చిచేష్టలు నీ కేల? నీ ప్రాణము కాపాడుకొనుము" అని రాజు హెచ్చరించెను. రాజు అధికారవచనములు విని భక్తరాజు ప్రేమసమాధినుండి మేల్కాంచెను. ఆ సమయమున తూర్పున అరుణోదయమగుచుండెను. పక్షులు తమ కిలకిలారవములచే సూర్యభగవానుని ఆహ్వానించుచుండెను. భక్తులహృదయస్థితుడగు నటరాజుని మనోరమమూర్తి మందహాసము చేయుచుండెను.

రాజుపల్కినది నిజమేనని భక్తరాజు తలచెను. "నేను మాత్రము భగవానునినమ్మికూర్చుంటిని. మరి ఆతడేమి ఆలోచించుచున్నాడో! ఆతడింతవరకును నిద్రించుచున్నాడా? లేక ఈ ప్రేమయజ్ఞమందు నను బలిదానమీయ దలంచినాడా?" అని ఆలోచించుచుండగా ఆతని నేత్రములవెంబడి కన్నీరుకారజొచ్చెను. తన కరతాళములగైకొని కేదారరాగమున ప్రేమపూర్ణముగ భజనచేయజొచ్చెను.

"దయామయా! నిన్ను ప్రేమించినదాని కిదియా ఫలితము? కాని నా శిరఃఖండనముకన్న నీ శరణాగతరక్షణబిరుదము గొప్పది. దేవా! శాస్త్రములందు నీ ఉదారత్వము, మహిమ గొప్పగ వర్ణింపబడియున్నది. నీవు పిడికెడు అటుకులకు బదులు కుచేలునకు బంగార మహలు కట్టించియున్నావు. ఒక్క దారపుపోగునకు ద్రౌపదికి తొంబదితొమ్మిదివందల తొంబదితొమ్మిది వలువలిచ్చి ఆమె మర్యాద కాపాడినావు. కుబ్జయొక్క చందనము గ్రహించి ఆమె అవక్రతను పోగొట్టితివి. గోపబాలుర గోవర్ధనయాగము స్వీకరించి వారిని రక్షించుటకొరకై ఏడుదినములు నీ చిటికెనవ్రేలుపై గోవర్ధనగిరి ఎత్తినావు. నావంతుకు వచ్చిన పుష్పహారమునకు నీవు లోభివయ్యెదవా? పరమాత్మా! రాజు చెప్పినది నిజమే. పందెము గెలిచిన ప్రాణము దక్కును. లేకున్న విలంబమైన మాండలీకుని ఖడ్గము నాకు మృత్యువు దాపురింపజేయును. ప్రభూ! నేను మృత్యువునకు భీతిలి నిను ప్రార్థించుటలేదు. నీ అపకీర్తికి వెరచుచున్నాను. మాట నెరవేరనిచో ప్రపంచము నీపేరిట నవ్వును. 'నమ్మినందులకు నరసింహారామునికి మంచిఫలితము కలిగిన'దని నవ్వుదురు. కాని ఓకృష్ణా! మరచితిని. ఇది నా కర్మఫలము. దీనియందు నీ దోషమెద్దియులేదు. కాని నిన్ను తప్ప నేను మరి ఎవ్వరిని పిలువగలను? నీకు నావంటి సేవకులు చాలమంది గలరు. కాని నరసింహారామునకు మాత్రము ప్రభువు ఒక్కడే. ప్రాణము పోవుచున్నను మరియొకని నెట్లు ప్రార్థించగలను? నీవు నన్ను రక్షించినను లేకున్నను నేను నిన్నుతప్ప వేరొకని నెవరిని సేవించను. దామోదరా! ఏమై

నను సరే. ఈ నరసింహరాము నీవాడే. బ్రతికించిననుసరే. చంపిననుసరే.”

భక్తవత్సలుడగు భగవానుడు ఇంతటికంటె ఎక్కువగు ప్రేమతోడి నిందల నెట్లు సహింపగలడు? ఆతడింక హెచ్చు పరీక్షింపదలచలేదు. సూర్యభగవానుడు తన మొదటి ప్రకాశమును చూపుచుండగనే ఇచట రాజమందిర ద్వారపు దృఢమైన ఇనుపగొలుసులు తాళము పటపట విరిగి భూమిపై పడి తలుపు తనంతట తెరచికొనెను. ఒక దివ్యజ్యోతి మందిరము నుండి బయల్వెడలి భక్తరాజువైపు నడచివచ్చెను. అచటి వారు ఆశ్చర్యమున కన్నులు విప్పారిచి ఈ అలౌకికదృశ్యమును చూచుచుండిరి. భక్తరాజువద్దకు వచ్చిన పిమ్మట ఆ ప్రకాశమునందు మురళీమోహనుని కాంతిమయస్వరూపము కానవచ్చెను. భగవానుడు ఎల్లరు చూచుచుండ తన కంఠహారమునుతీసి భక్తరాజుగళమున అలంకరింపజేసెను. హారము మెడలో పడగానే భక్తరాజు ఎలుగెత్తి “బోలో భగవాన్ శ్రీకృష్ణచంద్రకు జై” అని అరచెను.



## భక్తుడు - భగవానుడు

భక్తునిఎదుట భగవానుడు ప్రత్యక్షమయిన సమయమున ఆ భక్తునిస్థితి వర్ణింప నెవరితరము? భక్తరాజు ఆ దివ్యసుందర విగ్రహమును అనేకదృష్టితో చూచుచు తృప్తినొందక ఆతని పాదములపై బడెను. భగవానుడు నవ్వుచు ప్రేమపూర్ణముగ “నరసింహరాం! నేను నిన్ను వినోదమునకై

హెచ్చు కష్టపెట్టితిని" అనెను. "ప్రభూ! క్షమింపుడు. నీ మాయకు వశీభూతుడనై ఈ అసారసంసారమున అధికముగ ఉండ నిశ్చయించుట లేదు. ప్రభూ! మోసగీడులు, అన్యాయ వర్తనులు, నాస్తికులుగల యీ ప్రపంచమును వదలివేయు టుచితము. బండిమధ్యవనడచు శునకము శకటభారమంతయు తానే మోయుచున్నానని తలచుచు నడచుచుండును. అట్లే ఈ ప్రపంచమున ప్రాణులందరు అభిమానముచే సంసారభార మంతయు తమపైనే గలదని తలచి నానావిధమగు కష్టముల ననుభవింతురు. ఈఅసత్యలోకమన్న నాకు విసుగుపొడమినది. దీనిపై నాకెట్టి మమతయు లేదు. నేను నీపాదములు వినా బ్రహ్మపదమునుకూడ కోరబో"నని గద్గదకంఠుడై భక్తరాజు ప్రార్థించెను.

"భక్తరాజా! ప్రేమలో మునిగి ఈ సరసమగు సంసారమును దూషించుట మంచిదికాదు. పూర్వకాలమున భక్త ప్రహ్లాదుడు, ధృవుడు, అంబరీషుడు, విదురుడు, గోపాంగనలు మొదలగు భక్తులందరు ఈ సంసారమందుండియే నన్ను పొంది యున్నారు. వత్సా! నన్ను పొందుటకై అరణ్యవాసము, తీవ్రతపశ్చర్యలు మొదలగు వానితోడినిమిత్తము లేదు. మహా భారతమున——

"వనేపి దోషాః ప్రభవంతి రాగిణాం
గృహేపి పంచేంద్రియనిగ్రహాస్తపః
అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే
నివృత్తరాగస్య గృహం తపోవనం॥

(అరణ్యానివాసము చేయుచు, కామక్రోధాది షడ్వికారము లకు లోనైన వైరాగులకన్న సంసారమందుండి గృహస్థ ధర్మానుసారముగ జీవించు సంసారి మిక్కిలి ఉత్తముడు.) సంసారమును వదలి నన్నుపాసించు భక్తునికంటె సంసారమం దుండి నన్ను ప్రేమించువాడు నాకధికప్రియుడు. కాన దీని నుండి తప్పించుకొన యత్నింపరాదు''అని భగవానుడు సంసా రము యొక్క ఘనతనుగూర్చి వర్ణింపదొడగెను.

''ప్రభూ! నేను సంసారమందుండి భజించుచూ నిన్నె ల్లపుడు సంసార కార్యములకై కష్టపెట్టి నేను దోషభాగి నైనందులకు పశ్చాత్తాపము పొందుచున్నాను'' అని భక్త రాజు పల్కెను. ''వత్సా! నేను నీ కేమంత గొప్పకార్యములు చేసితిని? ఈ చిన్నచిన్న కార్యములుజేసి నీభక్తికి బదులు తీర్చుకొనెదనా? నీ సర్వస్వమును తను, మన ధనములు నా కర్పించి నన్ను సేవించినావు. ప్రాణముపోవుతరియైన నాభజన నుండి చలించలేదు. దీనికి బదులు నేనేమిచేసితిని? నీకుమా రుని వివాహము, పితృశ్రాద్ధము, కుమార్తెకట్నము, ఒక కాసీ విలువచేయు మాల ఒసంగితిని. దీనికొరకేనా నీవిట్లుమాట్లాడు చున్నావు. ఈకార్యములు సామాన్య ధనికుడెవడైన చేయ గలడు. భక్తరాజా! ఈ స్వల్పకార్యములచేసి నేను నీ బహు మూల్యమగు భక్తినుండి ఒక శతాంశముకూడ బదులు తీర్చు కొనలేను. ఏమిచేయగలను? నేను నాభక్తులకు ఋణగ్రస్థు డుగ ఉండుటయే నాకు సంతోషకరము. భక్తికి బదులుతీర్చి నేను దాని మహత్వము తగ్గింప''నని భగవానుడు ఉదార ముగ పల్కెను.

"ప్రభూ! నేను నిత్యము నీపాదధూళి ధరించు అవకాశ మెపుడు కల్గు"నని అధైర్యమున బల్కెను. "వత్సా! నేను నీకు ఈ మానవదేహమును నీ ఇష్టానుసారమే ఒసగితిని. బహుశః నామాయ ఆవరించుటచే నీవు మరచియుందువు. నేను జ్ఞాపకముచేసెద వినుము. నీవు పూర్వజన్మయందు భీషణ దేవాసుర సంగ్రామమున విజయమాలలు ధరించిన మాంధాత పుత్రుడగు ముచికుందుడను రాజువు. ఈ గిరినారప్రదేశాంత ర్గతమగు †ముచికుందుని గుహలో కాలయవనుని కారణముగ నీకు దర్శనమిచ్చితిని. ఆనాడు నీవు మోక్ష మడిగియుండినచో నీ వీ ఆపదలో పడియుండెడివాడవు కావు. కాని నాభక్తులు మోక్షమును తుచ్ఛముగ తలంతురు. అందువలననే నీవపుడు ఇట్లనియున్నావు.

"న కామయేన్యం తవ పాదసేవనా
దకించిన ప్రార్థ్యతమా ద్వరం విభో
ఆరాధ్య కస్త్వాం హ్యపవర్గదం హరే
వృణీత ఆర్యో వరమాత్మ బంధనమ్॥

— శ్రీమద్భాగవతము 10 స్కం. 51 సర్గ. 56శ్లో.

(హే ప్రభో! విషయవాంఛా రహితులకు ప్రార్థనీయుడ వగు నీ చరణసేవకన్న వేరొద్దియుకోరను. హరే! మోక్షము నిచ్చెడి నిన్ను ఆరాధించి, ఎవడు బంధనముల కోరుకొనును?)

---

† ముచికుందునిగుహ నేటికిని గిరినారప్రదేశమందుగల దామోదరకుండివద్ద నున్నది. ఇయ్యది రమ్యమగు స్థానము. ఏకాంతవాసము, తపశ్చర్యకు యోగ్యమైనది.

17

నేను నీఇచ్ఛావిరుద్ధముగ ఎట్లు వరమీయగలను? నేనుకూడ_

క్షాత్రధర్మస్థితో జంతూన్ వ్యవధీర్మృగయాదిభిః,
సమాహిత స్తత్తపసా జహ్యఘం మదుపాశ్రితః॥ 63
జన్మన్యనంతరే రాజన్ సర్వభూత సుహృత్తమః,
భూత్వా ద్విజవర స్త్వం వై మాముపైష్యసి కేవలమ్॥ 64

క్షత్రియధర్మముననుండి నీవనేక జీవులను వేటయందువధించితివి. కాబట్టి ఇపుడు సమాధినిష్ఠుడవై నన్నాశ్రయించి ఆపాపములను నాశనము చేసికొనుము. ఓరాజా! ముందుజన్మలో నీవన్నిభూతములకు మేలుచేయు బ్రాహ్మణోత్తముడవై నన్నుపొందెదవు.

ఆ క్షాత్రజన్మమందుచేసిన పాపములను తపశ్చర్యచే నాశనము చేయించి నేను నిన్ని ఉత్తమ నాగరకులమందు జన్మింపజేసితిని. భక్తరాజా! ఇపు డీ సంసారమున ఐదేండ్లుండి జగత్తున నాభక్తిని ప్రచారముచేయుము. నేటినుండి నీకెట్టి యాపద కలుగదు. నీ కీ జన్మలో నా అంతిమ దర్శనమువలన నీపై సరస్వతీకటాక్షము కల్గును. నీ పాంచభౌతిక దేహమంతమగువరకు స్వానుభవమగు భక్తిపూర్ణమగు గీతములను రచింపుము. ఇదియే నాసేవ'' యని బోధించుచు భగవానుడు తన అంతిమ ఆదేశమును పల్కెను.

భక్తరాజు భగవదాదేశము శిరసావహించి ఆతని పాదములపై బడెను. ఆత డెంతవరకిట్లు పడియుండెనో ఆతనికే తెలియదు. రాజు మేల్కాలిపినపుడు ఆ తేజోమూర్తి అదృశ్యమయ్యెను. భక్తుడు భగవానుని సంభాషణలతోడి అచటి ఆకసము ప్రతిధ్వనించెను.

---*---

## అంతిమ అవస్థ

భగవంతుని దర్శనమువలన సారంగధరుడు, వంశీధరుడు, అనంతరాయడు మున్నగువారల హృదయమందలి అజ్ఞానము నశించి భక్తిభావ ముదయించెను. వారు భక్తరాజునకు చేసిన ద్రోహమునకు పశ్చాత్తాప మొందిరి. నమ్రతతో వారు "నరసింహారాం! నీవంటి భగవద్భక్తుని వ్యర్థముగ కళంకపరచవలెనని యత్నించినందులకు చాలసిగ్గిలుచున్నాము. నిన్ను కష్టపెట్టిన మహాపరాధమునకు మాకు నరకమునందు గూడ స్థానము దొరకదు. దయయుంచి మా అపరాధములను క్షమింపుడు" అని పల్కిరి.

భక్తరాజు సరళముగ "సోదరులారా! పశ్చాత్తాపముతోడి భజనసల్పిన పూర్వసంచిత ప్రారబ్ధ పాపములు నశించును. నేటినుండి మీరుకూడ పాపములు చేయక ప్రీతితోడి భగవంతుని భజనచేసిన మీకు తప్పక కల్యాణము కల్గును. మీ కుపదేశించునంతటి యోగ్యత నావద్ద లే"దని పల్కెను. భక్తరాజుని నమ్రత, నిరభిమానము, భగవత్ప్రేమ, ప్రభావములు అందరిపై పడెను. అందరాతనిని ప్రశంసించుచు తమ తమగృహముల కేగి నాటినుండి భగవద్భజనయం దనురాగము గలవారైరి. రావుమాండలీక రాజునకు భక్తరాజుపై శ్రద్ధాభక్తు లధికమాయెను. ఆత డాతనిని సత్కరించి భజనమండలితోకూడ ఊరేగింపుచూ ఆదరముగ వీడ్కోలొసగెను. నాటినుండియు రాజు భక్తరాజుని ఇంటివద్ద సత్రము నెలకొల్పి క్షుద్బాధితులకు అన్నమిడునట్లు చేసెను. భక్తరాజు పిమ్మట

శాంతితోడ జీవితము గడుపుచు భగవద్భజన సల్పుచుండెను. భగవదాజ్ఞచొప్పున లోకకల్యాణనిమిత్తమై జ్ఞానభక్తిపూర్ణ ములగు కీర్తనలను రచించుచుండెను. ఆతని కోడలు జూఠీ బాయి, కుమార్తె కుమారబాయి అతనితోనుండిరి. వారును భక్తరాజుతోకూడ నియమముతో తమ జీవితమును భగవ ద్భజనయందు గడుపుచుండిరి.

ఈవిధముగ ఐదు సంవత్సరములు భక్తరాజు గడిపిన పిదప భక్తరాజు అశాశ్వతమగు భౌతిక దేహమునువీడి పర మాత్మపదవిని అలంకరించెను. ఐదేండ్లలో అనేక కీర్తనలు వ్రాసెను. ఆతని స్థూలశరీరము మనయెదుట లేకున్నను కావ్యమయమగు కీర్తి దేహము మనకు నేడుకూడ సత్సాం గత్యలాభ మిచ్చుచున్నది. ఆతని కీర్తనలు సంసారసంతప్త లగు మానవులకు కల్యాణమార్గమును చేర్చుటకు సహాయ భూతము లగుచున్నవి. ముందును చేయగలవు.

చివరికి మేము ఈ భక్తుల ప్రసవించు భారతభూమికి నమస్కరించుచున్నాము. ఆమెగర్భమున భక్తశ్రేష్ఠుడగు నరసింహమెహతావంటి మహాపురుషు లవతరించి తమ జగ త్పావనియగు భక్తిద్వారా సమస్తలోకమునకు కల్యాణమును చేకూర్చుచుందురు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

—గ—

# -* నరసీమెహాతా విరచిత కీర్తనలు *-

## 1

భూతుల భక్తి పదారథ మోటుం, బ్రహ్మలోక మాం నాంహీ రే
పుణ్యకరీ అమరాపురీ పామ్యా, అంతే చౌతాసీ మాంహీ రే॥
హరినా జన తో ముక్తి న మాగే, మాగే జన్మోజన్మ అవతార రే
నిత్య సేవా నిత్య కీర్తన ఓచ్ఛవ, నిరఖవా నందకుమార రే॥
భరతఖండ భూతలమాం జనమీ, జేణే గోవింద గుణనా గాయా రే
ధన ధన రే ఏనాం మాత పితా నే, సఫలకరీ ఐనే కాయా రే॥
ధన బృందావన ధన ఏ లీలా, ధన ఏ వ్రజనా వాసీ రే
అష్ట మహాసిద్ధి ఆంగణియే రే ఊభీ, ముక్తి ఛే ఎమనీ దాసీ రే॥
ఏ రసనో స్వాద శంకర జాణే, కే జాణే శుక జోగీ రే
కోఈ ఏక జాణే వ్రజనీ గోపీ, భణే నరసైంయో భోగీ రే॥

ఈ భూలోకమున భక్తి అనునది గొప్ప పదార్థము. అది బ్రహ్మలోకమున లేదు. పుణ్యములద్వారా స్వర్గమును పొందినవారు తిరిగి జనన మరణ యంత్రమున బడుదురు. హరిభక్తులు ముక్తిని కోరక ఎల్లపుడు జన్మలనే కోరుదురు. దానివలన వారు నిత్యము సేవా, కీర్తన, ఉత్సవములందు నందకుమారుని చూచుచుందురు. ఈ భరతఖండమున జన్మించి ఎవరు శ్రీకృష్ణుని గుణకీర్తన చేయుదురో వారి తల్లిదండ్రులు ధన్యులు. వారిజీవితము సఫలము. బృందావనము ధన్యమైనది. ఎవరి ఇంట అష్టమహాసిద్ధులున్నవో, ముక్తి ఎవరికి దాసియో అట్టి వ్రజనివాసులు ధన్యులు. ఆ రసాస్వాదము శంకరుడు, శుకుడు, గోపవనితలు ఎరుగుదురు. నరసింహామెహాతా ఆ యానందమును స్వయముగ అనుభవించి చెప్పుచున్నాడు.

## 2

తూం తారా బిరద సాంహాంమూ జోజే శామలా,న జోఇశ కరణీ హమారీశే

హిర్యణ్యాకశిపునే హాథే హణీయో, మాసీ పుతనా మారీ శే।
ప్రహ్లాదకారణ స్తంభ మాం వసీయా, ప్రగట్యా దేవ మొరారీ రే॥

లాఖాగ్రేహ మాం జేమ పాండవ ఉగార్యా,బ్రహ్మాండ జ్వాలా వ్యాపీ శే
అర్థ వచనే గజ గుణకా తారీ, జయదేవనే పద్మినీ ఆపీ రే॥

దుష్ట సభా మాం జేమ చీరజ పుర్యాం, లాజ పంచాలినీ పాలీ రే ।
తేల కఢా జేమ శితల కీధీ, వేలా సుధన్వానీ వాలీ శే॥

ఋషిశ్వరే జేమ అహాల్యా శ్రాపీ, బ్రహ్మ-సల్యా థయీ భారీ రే।
తే పణ తారే చరణే రఘువర, థయీ అనోపమ నారీ రే॥

మీరాబాయీనా బిఖ అమృత కీధాం, విదురనీ ఆరోగ్యా భాజీ రే।
శబరీ నా జేమ బోరజ ప్రాశ్యాం, తేనీ ప్రీతే థయా రాజీ శే॥

అనేక భక్త ఆగే ఉగార్యా, సహాయ థయా మురారీ శే।
నరసైంయాచా స్వామీ లక్ష్మీవర, మోటీ ఓథ తమారీ రే॥ తూం తారా॥

కృష్ణా! నీ బిరుదును చూచికొనుము. చూడవలసినది మా చేతలు కాదు. హిరణ్యాకసిపుని, పూతనను సంహరించి నావు. ప్రహ్లాదుని రక్షించుటకు స్తంభమున వెల్వడితివి. లాక్షాగృహమున ప్రచండాగ్నినుండి పాండవులను కాపాడి నావు. గజేంద్రుని మొర నాలకించితివి. జయదేవునకు పద్మిని నొసగినాడవు. దుష్టసభలో వలువలనిచ్చి ద్రౌపదిమర్యాదను రక్షించితివి. సుధన్వుని పరీక్షాసమయమున నూనెకడవను చల్లగ చేసినావు. గౌతమశాపమున శిలయైన నహల్య నీపాద స్పర్శచే సుందర నారీరూపము దాల్చినది. మీరాబాయి కొరకు విషము నమృతముగ చేసినావు. విదురునకు విందు చేసి నావు. శబరి ప్రేమతో నిడిన రేగుపండ్లను భుజించినాడవు.

మురారీ! అనేక భక్తులను కాపాడి వారలకు సహాయముచేసి యున్నావు. నరసీయునిస్వామీ! ఓలక్ష్మీపతీ! నాకునీవేదిక్కు.

**3**

సంసారనో భయ నికట న ఆవే, శ్రీకృష్ణ గోవింద గోపాల గాతాం।
ఉగర్యో పరీక్షిత శ్రవణే సుణతా, తాల వేణా విష్ణునా గుణ గాతాం॥
బాలక ధృవ దృఢ భక్త జాణీ, అవిచల పదవీ ఆపీ।
అసుర ప్రహ్లాదనే ఉగారీ లీధో, జనమ జనమనీ జడతా కాపీ॥
దేవనా దేవ తూం కృష్ణ ఆది దేవా, తారుం నామ లేతాం అభేపద దాతా।
తే తారా నామనే నరసైంయో నిత్యజపే, సారకర సారకర విశ్వఖ్యాతా॥

శ్రీకృష్ణ, గోవింద, గోపాల అని కీర్తనము చేసిన సంసారభయము దరిచేరదు. తాళరహితముగ పాడిన విష్ణు గుణములను విని పరీక్షిన్మహారాజు తరించెను. పసిబాలుడగు ధ్రువుని దృఢభక్తునిగ నెరింగి తన అచలపదవి నిచ్చెను. ప్రహ్లాదుని రక్షించి యాతని జన్మజన్మాంతర జడత్వమును పోగొట్టినావు. ఓ దేవదేవా! నీనామమును స్మరించిన మానవు డభయపదము నొందును. కాన నరసింహారాముడు నీ నామమును నిత్యము జపించుచుండును. ఓ విశ్వవిఖ్యాతా! నన్ను రక్షించుము.

**4**

అఖిల బ్రహ్మాండమాం ఏక తుం శ్రీహరీ, జూజవే రూపే అనంత భాసే
దేహమాం దేవ తుం, తేజమాం తత్వ తుం, శూన్యమాం శబ్ద థయీ వేద వాసేథ॥
పవన తుం పాణీ తుం, భూమి తుం భూధరా వృక్ష థయీ ఫూలీ రహ్యో ఆకాసే
వివిధ రచనా కరీ అనేక రస లేవానే శివ థకీ జీవ థయో ఎజ ఆశే॥ అ॥

వేద తో ఏమ వదే శ్రుతిస్మృతి సాఖ దే, కనక కుండల విషే భేద న్హోయే॥
ఘాట ఘడియా పఛీ నామరూప జూజవాం, అంత్యే తో హేమనుం హేమ హోయే॥

గ్రంథ గడబడ కరీ వాత న కరీ ఖరీ, హానే జే గమే తేనే పూజే॥
మన కర్మ వచనథీ ఆప మానీ లహే, సత్య ఛే ఏజమన ఏమ సూజే॥
వృక్షమాం బీజ తుం బీజమాం వృక్ష తుం, జోఉం పటంతరో ఏజ పాసే॥
భణే నరసైంయో ఏ మన తణీ శోధనా, ప్రీత కరుం ప్రేమథీ ప్రగట థాశే॥

హే హరీ! ఈ అఖిలబ్రహ్మాండమున నీ వొకడవైనను అనేక రూపములలో అనంతునిగ కన్పట్టుచున్నావు. శరీర మందలి ఆత్మవు నీవు. తేజములో తత్వము నీవు. శూన్యములో శబ్దరూపమై వేదమున ప్రకాశించుచున్నావు. గాలి, నీరు, భూమి, పర్వతములు అన్నింట నీవున్నావు. నీవే వృక్షములందు పుష్పించుచున్నావు. అనేకరచనలను సృష్టించి అనేకరసములను గ్రహించుటకు నీవు జీవుడవైతివి. బంగారమునకు బంగరు ఆభరణములకు భేదము లేదు. ఆభరణములు చేయబడినమీదట నామ రూపములు వేర్వేరగుచున్నవి. చివరికి బంగారము బంగారమే – అని శ్రుతి స్మృతులు, వేదములు చెప్పుచున్నవి. గ్రంథము లేవేవో చెప్పుచుండును, ఒకప్పుడు నిజము తెల్పవు. ఎవని కేది రుచించునో దానినే వాడు పూజించును. మనో వాక్కాయ కర్మలచే ఆత్మను గుర్తించి అద్దానిని పొందుటయే సత్యము. వృక్షమునందలి బీజము నీవు. బీజమందు వృక్షము నీవు. మధ్యన మాయయనెడి తెర ఉన్నది. అట్టి మనోవాంఛితవస్తువు ప్రేమవలననే వెల్వడగలదని నరసింహరాము చెప్పుచున్నాడు.

5

వాస నహి జ్యాం వైష్ణవ కేరో త్యాం నవ వసియే వాసడీయాం।
శ్వాసేశ్వాస హరి స్మరణ న కరే జో, శ్వాస ధమణ కేరీ శ్వాసడీయాం॥
జీభలడీ జపమాలా న జపేతో, జీభలడీ నహి ఖాసడీయాం।
జనము తేనో నహి లేఖామాం, జే న కహేవాయ హరి దాసడీయాం॥
మోహనజీనీ మాయా పాఖే అవర మాయా జమ ఫాంసడీయాం
భణే నరసైంయో భారే మరీ, మావలడీ దశ మాసడీయాం॥

విష్ణుభక్తులులేని ప్రదేశమున నివసింపరాదు. ఉచ్ఛ్వాస నిశ్వాసములందు హరిస్మరణ చేయని శ్వాస, కమ్మరివాని కొలిమితిత్తి సదృశమైనది. నామజపము చేయని జిహ్వ జిహ్వ కాదు. హరికి దాసుడు కాని వాని జన్మ ఎందుకు? శ్రీకృష్ణునియందు ప్రేమ వినా తదితర ప్రేమలు యమరాజుని ఉరి వంటివి. ఎవడు హరిభక్తుడు కాడో ఆతనితల్లి నవ మాసములు వ్యర్థముగ మోసినదని నరసీమెహతా చెప్పుచున్నాడు.

6

నారాయణనుం నామజ లేతాం, వారే తేనే తజియే రే।
మనసా వాచా కర్మణా కరీనే, లక్ష్మీవరనే భజియే రే॥
కుళనే తజియే కుటుంబనే తజియే, తజియే మానే బాప రే।
భగిని సుత దారానే తజియే, జేమ తజే కంచుకీ సాప రే॥
ప్రథమ పితా ప్రహ్లాదే తజియో, నవ తజియుం హరినుం నామ రే।
భరత శత్రుఘ్నే తజీ జనేతా, నవ తజియా శ్రీరామ రే॥
ఋషిపత్నీ శ్రీహరినే కాజే, తజియా నిజ భర్తార రే।
తేమాం తేనుం కాంఇయే న గయుం, పామీ పదారథ చార రే॥
వ్రజవనితా విఠలనే కాజే, సరబ తజీ వన చాలీ రే।
భణే నరసైంయో బృందావనమాం, తే తో ఘణుం మాహాలీ రే॥

నారాయణ నామమును జపించుచుండగ ఎవ డడ్డగించునో అతనిని వదలివేయుము. మనో వాక్కాయకర్మలతో లక్ష్మీపతిని భజింపుము. కులము, కుటుంబము, తల్లిదండ్రులు, సోదరీ సోదరులు, దారాపుత్రాదులు అందరిని సర్వము కుబుసము వదలినటుల విడిచిపెట్టవలయును. పూర్వము ప్రహ్లాదుడు తండ్రిని వదలెను. కాని హరినామమును మాత్రము విడువలేదు. భరత శత్రుఘ్నులు తమ తల్లిని విడనాడిరి. శ్రీరాముని విడువలేదు. ఋషిపత్నులు ప్రభునికొరకు తమ భర్తలను త్యజించిరి. అందువలన వారి కెట్టి హానియు కలుగక ధర్మార్థ కామమోక్షము లను చతుర్విధ పురుషార్థములను పొందిరి. వ్రజవనితలు శ్రీకృష్ణునికొరకు సర్వమును వదలి వనమున కేగిరి. ఈ బృందావనమున అయ్యది గొప్ప ఆంతరంగికవిషయమని నరసింహరాము చెప్పుచున్నాడు.

## 7

వారీ జాఊం రే సుందర శ్యామ, తారా లటకానే॥
లటకే రఘువర రూప ధరీనే, వచన పితానాం పాళయాం రే।
లటకే జయీా రణే రావణ రోళయో, లటకే సీతా వాళయాం రే॥
లటకే గిరి గోవర్ధన తోల్యో, లటకే వాయో వంశ రే।
లటకే జఈ దావానల పీధో, లటకే మార్యో కంస రే॥
లటకే గాఓ గోకులమాం చారీ, లటకే పలవట వాలీ రే।
లటకే జయి జమునామాం పేఠా, లటకే నాథ్యో కాలీ రే॥
లటకే వామన రూప ధరీనే, జాచ్యా బలీనే ద్వార రే।
త్రణ డగలాం పృథ్వీనే కాజే, బలి చాంప్యో పాతాల రే॥
ఏవాం ఏవాం లటకా ఛే ఘణాం రే, లటకాం లాఖ కరోడ రే।
నరసైంయాంచా స్వామీ సంగే రమతాం, హీడుం మోడామోడ రే॥

ఓ సుందరశ్యామా! నీ లీలలపై నేను బలియగుచున్నాను. లీలకై రఘురాముని రూపము దాల్చి పిత్రాజ్ఞను పాలించినావు. అరణ్యమున రావణుని నీ లీలచే సంహారించితివి. సీతను గొని తెచ్చితివి. గోవర్ధనపర్వత మెత్తినది నీ లీలయే. దావానలము మ్రింగుటయు నీ లీలయే. కంసుని వధించుట నీ లీల. గోకులము, గోరక్షణ గావించుటయు నీ లీలయే. యమునయందు గల కాళిందిని మర్దించుట నీ లీల. వామన రూపమును ధరించి మూడడుగుల భూమికై బలిచక్రవర్తిని పాతాళమునకు త్రొక్కుట నీ లీల. ఇట్టి లీల లనేకములు కలవు. నరసింహరాముడు తన స్వామితోడి ఆటపాటలయందు మనము ఐక్యము గావించుచున్నాడు.

## 8

వైష్ణవజన నే విరోధ న కోఇసుం, జేనాం కృష్ణచరణే చిత్త రహ్యాం రే।
కావా దావా సర్వే కాఢ్యా, శత్రు హాతా తే మిత్ర థయా రే॥

కృష్ణ ఉపాసీ నే జగథీ ఉదాసీ, ఘాంసీ తే జమనీ కాపీ రే।
సావర జంగమ తామ న తాలో, సఘళే దేఖే కృష్ణ వ్యాపీ రే॥

కామ కే క్రోధ వ్యాపే నహీ క్యారే, త్రివిధ తాప జేనా టళియా రే।
తే వైష్ణవనా దర్శన కరియే, జేనా జ్ఞానే తే వాసనిక గళియా రే॥

నిస్పృహీ నే నిర్మల మతి బలీ, కనక కామినినా త్యాగీ రే।
శ్రీముఖవచనో శ్రవణే సుణతాం, తే వైష్ణవ బడభాగీ రే॥

ఏవా మళే తో భవదుఃఖ టలే, జేనాం సుధా సమాన వచన రే।
నరసైంయాచా స్వామీనే నిశదిన వ్హాలా, ఏవా తే వైష్ణవజన రే॥

శ్రీకృష్ణుని పాదములం దెవని మనస్సు స్థిరముగ నుండునో, అట్టి విష్ణుభక్తున కెవరితోడను విరోధముండదు.

శత్రువులు మిత్రులగుదురు. అతడు శ్రీకృష్ణుని ఉపాసించుచు ప్రపంచమున ఉదాసీనుడుగ నుండును. యమపాశములను త్రెంచును. స్థావరజంగమములందంతటను సర్వవ్యాపకుడగు కృష్ణుని చూచును. త్రివిధతాపములు తొలగినవానికి కామ క్రోధాదు లుండవు. ఆత్మజ్ఞానమువలన ఎవనికోర్కెలు నశించి నవో, అట్టిభక్తుని సందర్శించవలయును. నిర్మలబుద్ధి, నిస్పృహ కలవాడు - కామినీ కాంచనములను త్యజించును. ఆతని వాక్యములను విన్నవాడు భాగ్యశాలి. అమృతవాక్కుల నుపదేశించు వైష్ణవభక్తులు దొరకిన సంసారబాధలన్నియు తొలగిపోవును. నరసీరామున కిట్టివారు ఎల్లప్పుడును ప్రియులు.

## 9

గాయే గోపీ గోవిందనా గుణ, ఉలట అంగ న మాయే రే।
రావ మశే తే శామలియానుం, ముఖడుం జోవా జాయే రే॥

దూధ దహీ అగల కరీ రాఖే, మాంఖణ సాకర మాంహే రే।
ధరనాం దవార ఉఘాడాం మూకే, జో ఆవే తే ఖాయే రే॥

ధన ధన గోకుల ధన ధన గోపీ, కృష్ణనా గుణ భావే రే॥
నిశదిన ధ్యాన ధరే మన మాహీనుం, ఇమ జాణే ఘేర ఆవే రే॥

జేనుం ధ్యాన ధరే మహా మునిజన, తే స్వపనే నా దేఖే రే।
తే శామలియో ప్రగట థఇనే, ప్రేమదా ప్రేమే పేఖే రే॥

యజ్ఞ కరే త్యాంహాం ప్రగట న థాయే, తే గోపీనా ఘర మాంహే రే।
భణే నరసైంయో గోరస గమతుం, మాఖణ చోరీ ఖాయే రే॥

గోవిందుని గుణగానము చేయుచు గోపికలు శరీరమును మరచిరి. చల్ల మిద పైని శ్యామసుందరుని చూచుటకు పోవు చుండిరి ఇంటితలుపులు తెరచి పాలు పెరుగు వెన్న ఎదుట

పెట్టిరి. కృష్ణుడు వచ్చి వాని నన్నిటిని తినవలయునని వారి కోర్కె. గోకులము ధన్యమైనది. కృష్ణునియం దనురక్తిగల గోపికలు ధన్యులు. రేయింబవళ్లు హరిని ధ్యానించుచు అతడు మన ఇంటికి వచ్చిన బాగుండునని తలంతురు. కఠినతపములు చేయు మునిజను లెవనిని కలయందైనను గాంచలేరో, ఆతడు ప్రత్యక్షముగా ఆ స్త్రీలను ప్రేమతో చూచుచున్నాడు. యజ్ఞములుచేసినను కన్పడనివాడు గోపికలయింట నున్నాడు. అతనికి ప్రేమ యనెడి గోక్షీరము యిష్టము. దానికి ఆతడు దొంగిలించి వెన్న తినునని నరసింహరాము చెప్పుచున్నాడు.

## 10

సంతో హమే రే వేవారియా శ్రీరామనామనా।
వేపారీ ఆవే ఛే బధా గామ గామనా॥

హమారూం వసాణుం సాధు సఘళో నే భావే।
అఢారే వరణ జేనే హారవా నే ఆవే॥

హమారూం వసాణుం కాళ దుకాళేం న ఖూంటే।
జేనే రాజా న దండే, జేనే చోర న లూంటే॥

లాఖ బినానా లేఖా నహిం, నే పార బినానీ పూంజీ।
హారవుం హోయ తో హారీ లేజో, కస్తూరీ ఛే సోంఘీ॥

రామనామ ధన హమారే, బాజే నే గాజే।
ఛప్పన ఊపర భేర భేరి, భూంగల బాజే॥

ఆవరో నే ఖాతాబహీమాం, లక్ష్మీవరనుం నామ।
చీఠీ మాం చతుర్భుజ అఖియా, నరసైంయానుం కామ॥

సజ్జనులారా! మేము రామనామంపు వ్యవసాయదారులము. మావద్ద కనేక గ్రామాదులనుండి వ్యాపారులు వచ్చె

దరు. సాధువులారా! మా సామాగ్రి నాణ్యమైనది. పదు
నెనిమిది వర్ణములవారు దానిని గైకొనుటకు వచ్చెదరు.
క్షామమందైనను క్షీణింపనిది మా సామాగ్రి. రాజు దండన
మున గ్రహింపలేడు. దొంగ దొంగిలింపలేడు. లక్షకులోటగు
లెక్కలపుస్తకమే లేదు. మూలధన మపారము. వలయునన్న
వేగిరపడుడు. కస్తూరి చౌకగ లభ్యమగుచున్నది. మాకు
రామనామమే ధన్యము. కాతాపుస్తకములందు లక్ష్మీవరుని
నామము, పత్రములందు చతుర్భుజనామము వ్రాయుటయే
నరసింహరాముని పని.

## 11

వైష్ణవజన నే విషయథీ తళవుం హాళవుం మాంహీథీ మన రే।
ఇంద్రియ కోఈ అపవాద కరే నహీ, తే నే కహియే వైష్ణవజన రే॥

కృష్ణ కృష్ణ కహేతాం కంఠజ సూకే, తో యే న మూకే నిజనామ రే।
శ్వాసోశ్వాసే సమరే శ్రీహరి, మన న వ్యాపే కామ రే॥

అంతరవృత్తి అఖండ రాఖే హరిసుం, ధరే కృష్ణనుం ధ్యాన రే॥
వ్రజవాసినీ లీలా ఉపాసే, బీజుం సుణే నహీం కాన రే॥

జగసుం తోడే నే జోడే ప్రభుసుం, జగసుం జోడే ప్రభుసుం త్రుటీ రే॥
తే నే కోఈ వైష్ణవ నవ కహేసో, జముడా లఈ జాశే ఘటీ రే॥

కృష్ణ బినా కాంఈ అన్య న దేఖే, జేనీ వృత్తి ఛే కృష్ణాకార రే॥
వైష్ణవ కాహావే నే విషయ న జావే, తే నే వార వార ధిక్కార రే॥

వైష్ణవనే తో వల్లభ లాగశే, ఘడియా నే లాగశే కాచుం రే।
నరసైంయాంచా స్వామీనే లంపట నహీంగమే, శోభసే సాచుం రే॥

విష్ణుభక్తులు విషయవాసనలనుండి మరలి మనసును
నిర్మలముగ నుంచుకొనవలయును. దురాచార రహితుడై

ఇంద్రియములను లోబరచుకొనినవాడే వైష్ణవజనుడనబడును. గొంతుక ఎండినను 'కృష్ణకృష్ణ'యని నామోచ్చారణచేయుట ఎవడు విడువడో, ఎవడు ఉచ్ఛ్వాసనిశ్వాసములయందు హరి స్మరణ చేయునో, ఎవని మనమునందు కోర్కెలుండవో, ఎవడఖండరూపమున హరియందు విలీనుడై ధ్యానము సల్పునో, గోపబాలుడగు శ్రీకృష్ణుని ఉపాసించునో, ఇతరపల్కులకు తన చెవి యొగ్గడో, జగత్తునుండి తన మనస్సును మరల్చి ప్రభువునందు లయింపజేయునో వాడే వైష్ణవభక్తుడు. లోక సంబంధీకుడై ప్రభువునకు దూరుడైనవాడు వైష్ణవభక్తుడు కాజాలడు. వానిని యమదూతలు గైకొనిపోవుదురు. ఎవడు శ్రీకృష్ణునివినా తదితరములను గాంచడో, ఎవ్వానివృత్తి కృష్ణాకార మైనదో వాడే వైష్ణవుడు. వైష్ణవనామము ధరించియు ఎవ్వని మనసు విషయములనుండి నివృత్తికాజాలదో వాని నామము స్మరింపరానిది. ఈ విషయము వైష్ణవులకు ప్రియము గను, కపటులకు వెగటుగ దోచును. నరసింహారామునకు లంపటత్వ మయిష్టము. ఆతనికి సత్యవాదియే ప్రియుడు.

## 12

హే ఆజ సఖీ రే శ్రీబృందావనమాం మధరా తే మొరలీ వాగీ రే।
సుణతాం రే చీత హర్యా మారీ సజనీ, భర నిద్రామాం థీ హుం జాగీ రే॥

హే జాగ్రత స్వప్న సుషుప్తి తురీయా, ఊనమీయే తాలీ లాగీ రే।
త్రిగుణ రహిత థయుం మన మారూం, కామవాసనా తాంహాం భాగీ రే॥

ఈ జమ-జమ ద్రష్ట పడే మారీ సజనీ, తమ-తమ తాణీ మోహాతీ రే।
నరసైంయాంచా స్వామీనీ లీలా హరఖే హీడు హుం జోతీ-జోతీ రే॥

హే సఖీ! నేడు బృందావనమందు నిశిరేయిని మురళి శ్రోత వినవచ్చినది. అదివినగనే నాచిత్తముల్లాసమొందినది. గాఢనిద్రనుండి మేల్కొంటిని. జాగ్రత, స్వప్న, సుషుప్తి, తురీయావస్థల నధిగమించి నా మనము త్రిగుణరహితమైనది. ఆ సమయమున కామవాసనయే తొలగిపోయినది. హేసఖీ! చూచినకొలది మోహము పెంపొందినది. నరసింహారాముని ప్రభులీలలు గాంచెడి సంతసమున హృదయముప్పొంగిపోయినది.

## 13

క్రృష్ణ కహో క్రృష్ణ కహో, ఆ అవసర ఛే కే వానుం।
పాణీతో సర్వే జరసీ జాశే, రామనామ ఛే రే వానుం॥

రావణ సరఖా ఝట చాల్యా, అంతకాలనీ ఆంటీ మాం।
పలకవార మాం పకడీ లీధా, జాణో జమనీ ఘాంటీ మాం॥

లఖేసరీ లాఖో లుటాయా, కాలే తేనాఖ్యా కూటీ నే।
క్రోడపతినూం జోర న చాల్యుం, తే నర గయా ఉఠీనే॥

ఏ కహేవానుం స్తానే కహియే, నిశదిన తాలీ లాగీ రే।
కహే నరసైంయో భజతాం ప్రభు నే, భవనీ భావట భాగీ రే॥

"కృష్ణ కృష్ణ" యనుము. అట్లనుట కిది తరుణము. జలమంతయు వర్షించిపోయినను కేవలము రామనామము మాత్రము నిలచును. రావణునివంటివారల రెప్పపాటుకాలమున యమధర్మరాజు వశపరచుకొని కాలగర్భమందు లీనమగునట్లు చేసినారు. లక్షలాది లక్షాధికారులు కాలమందంతరించిపోయినారు. కోటీశ్వరులును నిర్నిమిత్తులై యిటనుండి వెడలిపోయినారు. ఎల్లరెరుగవలసిన విషయ మిదియే. రేయిం

బవల్లు మనసును ప్రభువునందు లయింపజేసిన ఈ సంసారంపు రాశపోకలనుండి విముక్తుడగునని నరసింహారాము తెల్పు చున్నాడు.

**14**

హరి హరి రటణ కర కఠణ కలికాల మాం।
దామ బేసే నహీం కామ సరసే।
భక్త ఆధీన ఛే శ్యామసుందర సదా।
తే తారాం కారజ సిద్ధ కరశే॥
అల్ప సుఖసారుం శుం మూఢ ఫూలో ఫరే।
శీశపర కాల రహ్యో దంత కరడే
పామర పలకనీ ఖబర తుజనే నహీం।
మూఢ శుం జోఇనే మూంఛ మరడే॥
ప్రౌఢ పాపే కరీ, బుద్ధి పాఛీ ఫరీ।
పరహరీ థడ శుం డాళే వళగ్యో।
ఈశనే ఈర్షా ఛే నహీం జీవపర।
ఆపణే అవగుణే రహ్యో రే అళగో॥
పరపంచ పరహరో, సార హృదియే ధరో।
ఉచరో హరి ముఖే అచల వాణీ।
నరసైంయా హరితణీ భక్తి భూలీశ మాం।
భక్తి వినా బీజుం ధూళధాణీ॥

ఈ కఠిన కలికాలమందు హరినామము జపించుము. లేశమైన వెచ్చింపకయే కార్యము దీనివలన జరుగగలదు. శ్యామసుందరు డెల్లప్పుడును భక్తాధీనుడు. నీ పని నెరవేర్చున దాతడే. మూఢా! స్వల్పసుఖమునకై ఒడలు మరచి తిరిగెద

వేల? నెత్తిపై నీ మరణకాలము వచ్చి కూర్చుండియున్నది. పామరుడా! అమూల్యమగు సమయము నీ వెరుగకున్నావు. దేనిసిగాంచి నీవు గర్వించుచున్నావు? పాపభారమున నీ బుద్ధి విపరీతమైనది. నీవు మొదలు వదలి కొమ్మలు పట్టియున్నావు. ఈశ్వరునకు జీవులపై ఈర్ష్యలేదు. నీ అవగుణముల చేతనే పదుడవగుచున్నావు. ఇపుడు ప్రపంచమును వదలి నిజవస్తువును మనమునందిడుకొని హరినామముచ్చరింపుము. హరిభక్తి వీడకుము. భక్తి వినా తదితరములు నిస్సారములని నరసింహారాముడు తెల్పుచున్నాడు.

## 15

కృష్ణజీ కృష్ణజీ కృష్ణజీ కహేతాం ఉఠో రే ప్రాణీ
కృష్ణజీ నా నామ బినా జే బోలో తో మిథ్యా రే వాణీ॥

కృష్ణజీ యే వాస్యం రుడుం గోకళీఊం రే గామ
కృష్ణజీ యే పూరీ మారా మనడా కేరీ హాం॥

కృష్ణజీ యే అహల్యా తారీ గుణకా ఓధారీ
కృష్ణజీ నా నామ ఊపర్ జాఊం బలిహారీ॥

కృష్ణజీ మాతా కృష్ణజీ పితా కృష్ణ సహోదర భాయీ
అంతకాలే జాఉం ఏకలడా సాథే శ్రీకృష్ణజీ సగాయీ॥

కృష్ణజీ కృష్ణజీ కహేతాం కృష్ణ పరీఖా థాశో
భణే రే నరసైంయో సేహేజే తమే వైకుంఠే జాశో॥

ఓ ప్రాణమా! "కృష్ణా కృష్ణా" యనుచు మేల్కొనుము. కృష్ణనామమువినా ఎయ్యది మాట్లాడినను మిథ్యయే. కృష్ణుడు గోకులమందు వసించి నా కోర్కెల నెరవేర్చినాడు.

అహల్య నాతిని తరింపజేసెను. వేశ్య నుద్ధరించెను. శ్రీకృష్ణ నామమునకై నేను బలియగుచున్నాను. కృష్ణుడే నా తల్లి, తండ్రి, సోదరులు. ఒంటరిగ పోవలయును. కృష్ణుడుమాత్రము వెంట నుండును. "కృష్ణా కృష్ణా" యనుచు కృష్ణుడ వయ్యెదవు. సహజముగ వైకుంఠము చేరగలవని నరసింహరాం చెప్పుచున్నాడు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

—ర—

## ఖమాజ్ - ధుమాలీ రాగం.

* వైష్ణవజన తో తేనే కహియే జే పీడ పరాయీ జాణే రే।
పరదుఃఖే ఉపకార కరే తోయే మన అభిమాన న ఆణే రే॥

సకల లోకమాం సహునే వందే నిందా న కరే కేనీ రే।
వాచ కాఛ మన నిశ్చల రాఖే ధన ధన జననీ తేనీ రే॥

సమదృష్టి నే తృష్ణాత్యాగీ పరస్త్రీ జేనే మాత రే।
జిహ్వా థకీ అసత్య న బోలే పరధన నవ ఝాలే హాథ రే॥

మోహ మాయా వ్యాపే నహి జేనే దృఢ వైరాగ్య జేనా మనమాం రే
రామనామశుం తాళీలాగీ సకల తీరథ తేనా తనమాం రే॥

వణలోభీ నే కపటరహిత ఛే కామ క్రోధ నివార్యా రే।
భణే నరసైంయో తేనుం దర్శన కర్తాం కుల ఏకోతేర తార్యా రే॥

* నరసీమెహతా కృతమగు ఈ కీర్తన పూజ్య బాపూజీకి అత్యంత ప్రియమైనది.

పరబాధల నెరిగినవాడే వైష్ణవభక్తు డనబడును. పరులకు దుఃఖముకలిగిన నాత డుపకారము చేయును. మనమునం దభిమానము చొరనీయడు. లోకమందలి సహృదయుల కెల్ల రకు నమస్కరించును. ఎవ్వరినైన నిందింపడు. మనోవాక్కాయ కర్మలను నిశ్చితము గావించుకొనును. అట్టివాని తల్లి ధన్యు రాలు. సమదృష్టి కలవాడే తృష్ణను త్యజించును. ఎవనికి పరస్త్రీ తల్లియో, ఎవ డసత్యమాడడో, పరధనమున కెవ డాశింపడో, ఎవనికి మోహ మాయలు ఆవరింపవో, ఎవని మనసు దృఢవైరాగ్యము కలిగియుండునో, ఎవడు రామనామ జపమును చేయుచుండునో ఆతని శరీరమున సకల తీర్థములు నివసించును. లోభ, కపట, కామ, క్రోధ రహితుడగువానిని దర్శించిన వంశము తరింపగలదని నరసింహరాం తెల్పు చున్నాడు.

శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహ పరబ్రహ్మార్పణమస్తు.

ఓం! ఓం!! ఓం!!!





## ప్రస్తుతం లభించు

# శ్రీ రామతీర్థ సేవాశ్రమ ప్రచురణలు

మీ జన్మసాఫల్యమైన బ్రహ్మజ్ఞానమును పొంది అఖండశాంతిని అనుభవించడానికి ఈ దివ్యగ్రంథాలను పఠించండి.

1. గీతాదర్శనము [భగవద్గీతను గూర్చిన శ్రీ నారాయణ పరమహంసలవారి విపులాద్భుత వివేచనము] ఫుల్ క్యాలికో బైండు 600 పేజీలు. ... 5-0-0
2. వేదాంత దర్శనము [శ్రీ రామతీర్థ స్వామివారి ఉపన్యాసములు] ... 2-8-0
3. మతము [శ్రీరామతీర్థస్వామివారి ఉపన్యాసములు] 2-0-0
4. భగవాన్ శ్రీరామతీర్థ [జీవిత చరిత్ర] ... 1-12-0
5. భక్తపోతనామాత్య [హరికథ] ... ... 0-8-0
6. భక్త కన్నప్ప [హరికథ] ... ... 0-8-0
7. భక్త ప్రహ్లాద విజయము [బుఱ్ఱకథ] ... 0-8-0
8. హరిజనజ్యోతి - భక్తనందనార్ [బుఱ్ఱకథ] 0-8-0
9. ధ్రువవిజయము [బుఱ్ఱకథ] ... 0-8-0
10. తులసీదాసకృత శ్రీ రామచరితమానసము [బాలకాండ] (శ్రీ కేశవతీర్థస్వామివారిచే మూలమునకు సరియైన ఆంధ్రానువాదము - ద్విపదకావ్యము) ... 5-0-0
11. భక్తియోగము [శ్రీరామతీర్థస్వామి కృతము] .... 1-8-0
12. భక్త నరసింహమెహతా [జీవితచరిత్ర] ...

# పాకెట్ సైజు అమూల్య గ్రంథాలు

12. శ్రీ శంకరాచార్య సదుపదేశాలు ... 0-8-0
13. శ్రీమద్రామాయణోపదేశాలు ... 0-4-0
14. రామగీత [శ్రీరామతీర్థ వేదాంత గీతాలు) ... 1-4-0
15. శ్రీ నృసింహోపాసనం [స్తోత్రం] ... 0-4-0
16. శ్రీ భోళాలింగ శతకం ... 0-4-0
17. రామానుజ దర్శనం ... 0-12-0
18. మహాత్ముని మాటలు [గాంధీజీ సూక్తులు] ... 0-12-0

# చిత్రపటములు

1. శ్రీరామతీర్థస్వామివారి చిన్నసైజు సాదాఫొటోలు (4రకాలు) 0-6-0
2. శ్రీరామతీర్థస్వామివారి త్రివర్ణచిత్రము [చిన్నది] 0-4-0
3. శ్రీరామతీర్థస్వామివారి తలవఱకుగల సాదాఫొటో 0-2-0
4. శ్రీ మట్టపల్లి నరసింహస్వామి ఫొటో ... 0-1-0

# రామదర్శనం

ఇది మాచే ప్రచురింపబడుతున్న ఆధ్యాత్మిక మాసపత్రిక. సర్వమతసామరస్యాత్మకములైన భక్తి జ్ఞాన కర్మయోగ సంబంధములైన మహోత్తమ వ్యాసాలిందు ప్రచురింపబడుతుంటాయి. ఇది శ్రీరామతీర్థస్వామివారి అనుష్ఠాన వేదాంత సందేశమును ప్రచారముచేసే ఏకైక ధార్మిక మాసపత్రిక. శ్రీ కేశవతీర్థస్వామివారి సంపాదకత్వమున 7 సం॥ల నుండి నడుస్తున్నది. జనవరినెల నుండి సంవత్సర ప్రారంభం. ప్రతిమాసం 1 వ తేదీన వెలువడుతుంది. సం॥లో ఎప్పుడు చేరినా, జనవరి నుంచి సంచికలు పంపబడతాయి. తరుగయిన సంచికలకు, సంచిక 1 కి రు. 0-4-0 లు తగ్గించబడును. సంవత్సర చందా రూ. 3-0-0 లు. వి.పి. లు పంప నవకాశము లేదు. అడ్రసు, పేరు వివరరిగా వ్రాయాలి.

గమనిక: పుస్తకముల వెలలో పోస్టేజి చేరలేదు. ఒక రూపాయికి లోపు వెలగల పుస్తకాలు వి. పి. గా పంపబడవు. ఆర్డరిచ్చువారు తమపేరు, అడ్రసు వివరముగా వ్రాయవలెను. ఉత్తరప్రత్యుత్తరాలకు తిరుగు తపాలాబిళ్ళలు పంపవలెను.

## ఆశ్రమం నుండి త్వరలో పునర్ముద్రణ కావలసిన గ్రంథములు

1. శ్రీరామతీర్థ సంపూర్ణ వేదాంత సారస్వతము - 8 భాగములు
2. శ్రీ రామతీర్థపరమహంస జీవితము [రామకథ]
3. శ్రీ సమర్థ రామదాస బోధలు
4. బుద్ధోపదేశములు
5. కబీరు సూక్తులు
6. శ్రీ నృసింహాశ్రయం

## ఆశ్రమంనుండి త్వరలో ముద్రణకానున్న గ్రంథములు.

1. శ్రీరామచరిత మానసము [శ్రీమదాంధ్ర తులసీరామాయణము] అయోధ్యాకాండాదులు
2. శ్రీరామతీర్థ బోధామృతము [శ్రీరామతీర్థ మహావాక్యములు]
3. శ్రీరామతీర్థ వేదాంత కథలు
4. శ్రీమద్భాగవతోపదేశములు
5. శ్రీకృష్ణచైతన్యస్వామి [పద్యనాటిక]
6. శ్రీ నృసింహ భజనము
7. బుద్ధగీత
8. Thus spake Sankara
9. భక్తప్రహ్లాద [హరికథ]
10. భక్త జ్ఞానదేవ [ ,, ]
11. భక్త తులసీదాస్ [ ,, ]
12. భక్త రంతిదేవ [ ,, ]
13. ప్రేమదర్శనము [నారద భక్తి సూత్ర వ్యాఖ్యానము]

వలయువారు:—

కార్యదర్శి, శ్రీరామతీర్థ సేవాశ్రమం, పిడుగురాళ్ల.

గుంటూరుజిల్లా – ఆంధ్రప్రదేశ్.

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| గ్రంథము | వెల |
|---|---|
| అష్టాదశ శ్లోకగీత(వ్యాఖ్య) | 0-12-0 |
| ఆరపంచకము | 0-12-0 |
| * ఆశ్వినమాహాత్మ్యము | 2- 0-0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0- 3-0 |
| ఉపాసనీబాబా జీవితము | 1- 8-0 |
| కల్యాణకుంజము | 1- 4-0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణవివేకానందులు) | 1- 0-0 |
| గీతాప్రతిభ (2వ కూర్పు) | 0-12-0 |
| గీతాకదంబము 1వ దళము | 1- 4-0 |
| ,, 2వ దళము | 1- 4-0 |
| గోవిందదామోదరస్తోత్రం | 0- 8-0 |
| జడభరతుడు | 0-12-0 |
| * నరసదాసు కీర్తనలు | 0-10-0 |
| పరమసాధన (2వ కూర్పు) | 0-12-0 |
| పరమార్థతత్త్వము | 0-12-0 |
| పద్మపురాణం(ఆదిమఖం॥) | 1- 8-0 |
| ,, (భూమిఖండము) | 2- 0-0 |
| ,, (బ్రహ్మఖండము) | 1- 0-0 |
| బదరీయాత్ర (3వ కూర్పు) | 1- 0-0 |
| భగవత్ప్రాప్తి- ఉపాయములు | 0- 4-0 |
| భక్తితత్త్వము | 0-12-0 |
| భక్తిరసాయనము | 2- 0-0 |
| భారతీయతత్త్వశాస్త్రము | 2-0-0 |
| భాగవతకథ 2,3,4,5 భా1కి | 2-0-0 |
| భారతీయదర్శనం(ప్ర.ఖం) | 1- 8-0 |
| మానవధర్మము | 1- 0-0 |
| ముక్తిగీత | 0- 6-0 |
| రాధారహస్యము (40 గ్రంథములసారము) | 1- 4-0 |
| * శంకరగ్రంథ రత్నావళి | 3- 0-0 |
| * శ్రీరామపూజా విధానము | 0- 4-0 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0- 8-0 |
| శ్రీ సీతారామ శతకము | 0- 2-0 |
| శ్రీ త్యాగరాజ చరిత్ర | 0- 4-0 |
| * శ్రీరామనామప్రభావము | 0- 6-0 |
| శ్రీశుకుడు | 0-12-0 |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకం | 0- 4-0 |
| సప్తమహావ్రతములు | 0- 6-0 |
| సిద్ధాంత కల్పవల్లి | 1- 0-0 |
| సంకీర్తన మీమాంస | 1- 0-0 |
| హరినామ మహిమశతకము | 0- 4-0 |
| హిందూకోడ్ బిల్ సమీక్ష | 1- 0-0 |
| భగవద్గీత(మూలంశుద్ధప్రతి) | 0- 6-0 |
| అష్టాదశశ్లోకగీత (12 ప్రతులు 1-0-0) | 0- 2-0 |
| తులసీ - గోపూజ | 0- 3-0 |
| ధ్యానపద్ధతి | 0- 8-0 |
| భగవన్నామసంకీర్తనము | 0- 2-0 |

* ఈ గుర్తుగలవి గాక, మిగతా పైగ్రంథము లన్నియు ఒకసెట్టు తీసికొనిన సగముధరకే యివ్వబడును. ముందుగ రు. 10/-లు అడ్వాన్సు పంపాలి. మీరు ఆర్డరు యిచ్చునప్పటికి ఉన్న గ్రంథములే పంపబడును. వి. పి. తీసికొన ప్రార్థన.

ప్రతులకు:- సాధన గ్రంథమండలి, తెనాలి.